ఈశాన్యకోణమువందు " ౧ బల్లిప్రియ భువనము ౨ భూతపాల భువనము ౩ శ్రేష్ఠ భువనము ౪ శర్వభువనము ౫ సురేశ్వర భువనము ౬ వేదపారగభువనము ౭ జ్ఞాన భూభువనము ౮ సర్వజ్ఞ భువనము ౯ ఈశాన భువనము ౧౦ విద్యాధిప భువనము అను పది భువనము అను గలవు. ఇక ప్రతిష్ఠాకలను గూర్చి వచించెదను.

## ప్రతిష్ఠా కల.

ఇందు ౨ మంత్రములు ౨౧ పదములు ౨౪ వర్ణములు ౨౩ తత్వములు ౫౬ భువనములు చేరి యున్నవి. అవి యేవియన.

### మంత్రములు.

౧ వామదేవ గుహ్యాయనమః ౨ శిరసేస్వాహా.

### పదములు.

౧ రూపిపదము ౨ అరూపిపదము ౩ ప్రథమ ప్రథమ పదము ౪ తేజస్తేజపదము ౫ జ్యోతిర్జ్యోతిపదము ౬ అరూపదములు ౭ అనగ్ని పదము ౮ అధూమపదము ౯ అభస్మ పదము ౧౦ అనాదిపదము ౧౧ నా నా నా పదము ౧౨ ధూ ధూ ధూ పదము ౧౩ ఓం భూః పదము ౧౪ ఓం భువః పదము ౧౫ ఓం సువః పదము ౧౬ అనిధన పదము ౧౭ నిధనపదము ౧౮ నిధనోద్భవపదము ౧౯ శివపదము ౨౦ సర్వపరాపరాత్మపదము ౨౧ భువనేశ్వరపదము అను ౧౧ పదము లుండును.

### తత్త్వములు.

౧ ప్రకృతితత్త్వము ౨ బుద్ధి తత్త్వము ౩ అహంకార తత్త్వము ౪ మనస్తత్త్వము ౫ శ్రోత్రతత్త్వము ౬ త్వక్ తత్త్వము ౭ చక్షుస్తత్త్వము ౮ జిహ్వాతత్త్వము ౯ ఘ్రాణతత్త్వము ౧౦ వాక్తత్త్వము ౧౧ పాణితత్త్వము ౧౨ పాదతత్త్వము ౧౩ పాయుతత్త్వము ౧౪ గుహ్యతత్త్వము ౧౫ శబ్దతత్త్వము ౧౬ స్పర్శతత్త్వము. ౧౭ రూప తత్త్వము ౧౮ రసతత్త్వము ౧౯ గంధతత్త్వము ౨౦ ఆకాశతత్త్వము ౨౧ వాయు తత్త్వము ౨౨ వహ్ని తత్త్వము ౨౩ జలతత్త్వము అను తత్త్వము లుండును.

### వర్ణములు.

౧ టం ౨ ఠం ౩ డం ౪ ఢం ౫ ణం ౬ తం ౭ థం ౮ దం ౯ ధం ౧౦ నం ౧౧ పం ౧౨ ఫం ౧౩ బం ౧౪ భం ౧౫ మం ౧౬ యం ౧౭ రం ౧౮ లం ౧౯ వం ౨౦ శం ౨౧ షం ౨౩ సం ౨౪ హం అను వర్ణములుండుండును.

## భువనములు.

ప్రకృతితత్త్వమున ౧ శ్రీకర్ణభువనము ౨ సౌమ్యభువనము ౩ కౌమార భువనము ౪ వైష్ణవభువనము ౫ బ్రాహ్మ్యభువనము ౬ భైరవభువనము ౭ కృతభువనము ౮ అకృతభువనము అను ౮ భువనములున్నవి.

బుద్ధితత్త్వమున ౧ బ్రాహ్మ్యభువనము ౨ సుబ్రాహ్మ్య భువనము ౩ ప్రాకేశభువనము ౪ సౌమ్యభువనము ౫ ఇంద్రియాభువనము ౬ గాంధర్వ భువనము ౭ యాక్షభువనము ౮ రాక్షసభువనము అను భువనములు గలవు

అహంకారతత్త్వమున స్థలేశ్వర భువనముగలదు.

మనస్తత్త్వమున సుస్థలేశ్వర భువనముగలదు. శ్రోత్రాదిజ్ఞానేంద్రియతత్త్వపంచకమందు శంఖకర్ణభువనముగలదు. వాగాదికర్మేంద్రియతత్త్వపంచకమునందు కాలాంజన భువనముగలదు. ౧ శబ్దాదితన్మాత్రతత్త్వపంచకమునందు మండలేశ్వరభువనము ౨ మహాండ భువనము ౩ ద్విరండ భువనము ౪ సకలాండభువనము అను నాలుగుభువనములు గలవు.

ఆకాశ తత్త్వమందు ౧ స్థాణుభువనము ౨ స్వర్ణాక్ష భువనము ౩ భద్రకర్ణభువనము ౪ గోకర్ణ భువనము ౫ మహాలయాభువనము ౬ అవిముక్త భువనము ౭ రుద్రకోటి భువనము ౮ వస్త్రాపద భువనము అను ౮ భువనము లుండును.

వాయు తత్త్వమందు ౧ భీమేశ్వర భువనము ౨ మహేంద్రభువనము ౩ అట్టహాసభువనము ౪ విమలేశ్వర భువనము ౫ నఖల నాఖల భువనము ౬ కురుక్షేత్ర భువనము ౭ గయాభువనము ౮ అక్షుమహాభువనము అను నేనిమిదిభువనములు గలవు,

అగ్ని తత్త్వమునందు ౧ భైరవభువనము ౨ కేదారభువనము ౩ శ్రీశైలభువనము ౪ మహాకాలభువనము ౫ మధ్యమేశ్వరభువనము ౬ ఆమ్రాతికేశ్వరభువనము ౭ జలేశ్వరభువనము ౮ హరిశ్చంద్రభువనము అను నెనిమిది భువనములుండును.

జల తత్త్వమునందు ౧ అమరేశ్వర భువనము ౨ డుంఠిభువనము ౩ ముండి భువనము ౪ భారభూతిభువనము ౫ ఔషధిభువనము ౬ పుష్కరభువనము ౭ నైమిశ భువనము ౮ అమరేశ్వర భువనము అను నెనిమిది భువనము లుండును.

ఇక విద్యాకలను గూర్చి విచారింతము.

## విద్యాకల.

ఇందు ౨ మంత్రములు ౨౦ పదములు ౭ వర్ణములు ౭ తత్త్వములు ౮ భువనము

లుండును.

## మంత్రములు.

అఘోరహృదయాయనమః శిఖాయైవౌషట్ అను మంత్రములిందు గలవు.

## పదములు.

౧ వ్యాపహారపదము ౨ ఓంనమశ్శివపదము ౩ సర్వప్రభుపదము ౪ శివపదము ౫ ఈశానమూర్ధ్నిపదము ౬ తత్పురుషవక్త్రపదము ౭ అఘోరహృదయపదము ౮ వామదేవగుహ్యపదము ౯ సద్యోజాతిపాదపదము ౧౦ ఓంనమః పదము ౧౧ గుహ్యాతిగుహ్యపదము ౧౨ గోప్తృపదము ౧౩ అనిధనపదము ౧౪ సర్వయోగాధికృతపదము ౧౫ సర్వవిద్యాధిపపదము ౧౬ జ్యోతిరూపపదము ౧౭ పరమేశ్వర పరమేశ్వర పదము ౧౮ అచేతనాచేతనపదము ౧౯ వ్యోమివ్యోమ్ని పదము ౨౦ వ్యాపిక వ్యాపిని పదము అను యిరువదిపదము లీకలయందు గలవు.

## వర్ణములు.

౧ ఘం ౨ జా ౩ చం ౪ ఛం ౫ జా ౬ ఝా ౭ ఞం అను వర్ణములిందుగలవు.

## తత్త్వములు.

౧ మాయాతత్త్వము ౨ కాలతత్త్వము ౩ నియతితత్త్వము ౪ కలాతత్త్వము ౫ విద్యాతత్త్వము ౬ రాగతత్త్వము ౭ పురుషతత్త్వము అనుతత్త్వము లుండును.

## భువనములు.

మాయాతత్త్వమందు ౧ అంగుష్ఠమాత్రభువనము ౨ అర్క భువనము ౩ ఈశాన భువనము ౪ ఏకేక్షణ భువనము ౫ ఏకపింగళ భువనము ౬ ఉద్భవ భువనము ౭ అభవ భువనము ౮ వామదేవ భువనము ౮ మహాద్యుతి భువనము అను భువనములుతొమ్మిదియుండును.

కాలతత్త్వమందు ౧ శిఖేద ౨ ఏకవీర అను రెండుభువనములు గలవు.

నియతి తత్త్వమందు ౧ క్రోధ భువనము ౨ చండభువనము ౩ శూర భువనము ౪ పంచాంతకభువనములను నాలుగుభువనము లుండును.

కలాతత్త్వమందు ౧ సంవర్త భువనము ౨ జ్యోతిష భువనము అను భువనములుండును.

విద్యాతత్త్వమునందు ౧ మహాక్రోధ భువనము ౨ మహాచండ భువనము అనురెండు భువనములుండును.

రాగతత్త్వము నందు ౧ ఏకశివ భువనము ౨ అనంతభువనము ౩ అజ భువనము ౪ ఉమాపతి భువనము ౫ ప్రచండ భువనముఅనుభువనములుండును.

పురుషతత్త్వము నందు ౧ ఏకపాద భువనము ౨ ఈశాన భువనము ౩ భవభువనము ౪ ఉగ్రభువనము ౫ భీమభువనము అను భువనములుండును. ఇక శాంతికలను గూర్చి విచారింతము.

## శాంతికల.

శాంతికల యందు రెండు మంత్రములు ౧౨ పదములు ౩ వర్ణములు ౩ తత్త్వములు ౧౮ భువనములు వున్నవి.

## మంత్రములు.

౧ తత్పురుషవక్త్రాయనమః ౨ కవచాయహుం.

## పదములు.

౧ వ్యోమవ్యాపిని పదము ౨ వ్యోమరూపపదము ౩ సర్వవ్యాపినిపదము ౪ శివానంతపదము ౫ అనాథ పదము ౬ అనాశ్రిత పదము ౭ ధ్రువపదము ౮ శాశ్వత పదము ౯ యోగపీఠపదము ౧౦ సంస్థితపదము ౧౧ నిత్యయోగిపదము ౧౨ ధ్యానహారపదము అను పదములు గలవు.

## వర్ణములు.

౧ కం ౨ ఖం ౩ గం

## తత్త్వములు.

౧ సదాశివతత్త్వము ౨ ఈశ్వరతత్త్వము ౩ శుద్ధవిద్యాతత్త్వము.

## భువనములు.

సదాశివతత్త్వము నందు ౧ అనంతభువనము ౨ సూక్ష్మభువనము ౩ శివోత్తమభువనము ౪ ఏకనేత్రభువనము అనుభువనము లుండును.

ఈశ్వరతత్త్వము నందు ౧ ఏకరుద్ర భువనము ౨ త్రిమూర్తి భువనము ౩ శ్రీకంఠభువనము ౪ శిఖండి భువనము అను భువనములు గలవు.

శుద్ధవిద్యా తత్త్వమునందు ౧ వామ భువనము ౨ జ్యేష్ఠ భువనము ౩ రౌద్రి భువనము ౪ కాల భువనము ౫ కలవికర్ణ భువనము ౬ బలవికర్ణ భువనము ౭ బలప్రమథభు

వనము ౮ సర్వభూతదమన భువనము ౯ మనోన్మని భువనము అనుభువనము లుండును. ఇక శాంత్యతీతకళను గూర్చి ముచ్చటించుకొందము.

## శాంత్యతీతకళ.

ఇందు 3 మంత్రములు ౧ పదము ౧౬ వర్ణములు ౨ తత్త్వములు ౧౫ భువనము లుండును.

## మంత్రములు.

౧ ఓం శివాయ నమః ౨ ఈశానమూర్ధ్నే నమః 3 అస్త్రాయఫట్.

## పదములు.

౧ ఓంకారపదము.

## వర్ణములు

అం ఆం ఇం ఈం ఉం ఊం ఋం ౠం ఌం ౡం ఏం ఐం ఓం ఔం అం అః అను వర్ణము లుండును.

## తత్త్వములు.

౧ శివతత్త్వము. ౨ శక్తితత్త్వము.

## భువనములు.

శివతత్త్వమునందు ౧ అనాశ్రిత భువనము ౨ అనాథ భువనము 3 అనంత భువనము ౪ వ్యోమరూప భువనము ౫ వ్యాపిని భువనము ౬ ఊర్ధ్వగామిని భువనము ౭ రోచిక భువనము ౮ మోచిక భువనము ౯ దీపిక భువనము ౧౦ ఇందిర భువనము అను పది భువనములుండును.

శక్తి తత్త్వమునందు ౧ శాంత్యతీత భువనము ౨ శాంతి భువనము 3 విద్యా భువనము ౪ ప్రతిష్ఠా భువనము ౫ నివృత్తి భువనము అను నయిదు భువనము లుండును.

ఇంతవరకు విమర్శించిన విషయమువలన తెలినది యేమనగా ౧౧ మంత్రములు ౮౧ పదములు ౫౧ వర్ణములు 3౬ తత్త్వములు ౨౨౪ భువనములు ౫ కళలు గలిగిన షడధ్వలు ప్రకాశించుచున్నవి. ఇట్టి షడధ్వ శోధన తప్పక దీక్షాకాలమున జేయుదగినది.

## అశుద్ధాధ్వ.

దీనికి కర్తృత్వము శేషుడు :- ఇందు ముప్పది తత్త్వములు గలవు.

మాయయొక్క మొదటివికారము నియమ కారణభూతమైన కాలతత్త్వము. కర్మచేయువాని ఫలమును నియమించునది నియతితత్త్వము. ఆత్మకుగల జ్ఞానక్రియాస్వరూపము నడంచి అజ్ఞానసమృద్ధినొసగునది కళాతత్త్వము. పురుషులను విషయములందుప్రవర్తింపజేయునది విద్యాతత్త్వము విషయానురాగము గలుగజేయునది రాగతత్త్వము. ఆత్మకు ప్రకృతి భోక్తృత్వ ప్రయోజకమైనది పురుషతత్త్వము. గుణతత్త్వము మొదలు కొని పృథివీతత్త్వాంతము వరకు గలమూలప్రధాన కారణమైనది ప్రకృతితత్త్వము.

ప్రకృతి తత్వమునుండి గుణత్రయ రూపమైన చిత్త తత్వ ముదయించు చున్నది. చిత్త తత్వమునుండి రజ స్తమస్సులు లేనిబుద్ధి తత్వము గలుగు చున్నది. ఆబుద్ధి తత్వము అధ్యవసాయిని యనియు, అనధ్యవసాయిని యనియు రెండు విధములు. అనధ్యవసాయిని యను బుద్ధి యందు, ఇష్టాపూర్తాది జన్యములు- పూర్వములునగు ధర్మజ్ఞానాది గుణము లుండును.

## ఇష్ట కర్మలు.

శ్లో॥ అగ్నిహోత్రం తపస్సత్యం। వేదానాం చానుపాలనం।
ఆతిథ్యం వైశ్వదేవంచ। ఇష్టమిత్యభిధీయతే॥

తా॥ అగ్నిహోత్రము. తపస్సు. సత్యము. వేదాధ్యయనము. ఆతిథ్యము. వైశ్వదేవము- ఇష్టకర్మలని చెప్పబడును.

## పూర్త కర్మలు.

శ్లో॥ వాపీకూప తటాకాది। దేవతాయతనానిచ।
అన్నప్రదానమారామః। పూర్తమిత్యభిధీయతే॥

తా॥ దిగుడుభావులు- బావులు- తటాకములు- మొదలగు వానినిర్మించుట, దేవాలయములు కట్టించుట,అన్నప్రదానముచేయుట,తోటవేయించుట, పూర్త కర్మలనబడును.

ఇట్టి యిష్టాపూర్త కర్మలనాచరించువారు ధూమాదిమార్గమున- అనగా శ్లో. ధూమారాత్రిస్తథాకృష్ణష్షాణ్మాసాదక్షిణాయనం। తత్రచాంద్రమసంజ్యోతిర్యోగీప్రాప్య నివర్తతే "అను గీత వచనము ననుసరించి ధూమము- రాత్రి- కృష్ణపక్షము దక్షిణాయనము పితృయానము- పింగళనాడి యీమార్గముల చంద్రలోకమునకు వెళ్లుదురు, అచ్చట పుణ్యఫలంబు ననుభవింతురు.

క్షీణేపుణ్యేమర్త్యలోకంవిశంతి" అను వచనము ననుసరించి మేఘమునందు బడిజలరూపముగా బడి భూమియందలి యోషధులలో జేరి అన్నరూపమై పురుషుని చెందిశుక్లముద్వారా స్త్రీగర్భంబును బొంది తొమ్మిదిమాసములుగడచినతరువాత పుత్రికగనో, పుత్రుడుగనో పుట్టి పుణ్యపాప సహితములగు కర్మల నాచరించుచు శివజ్ఞానము జనించువరకు నాటి నాటికి బుట్టుచు జచ్చుచుందురు. దీనినే ధూమాదిమార్గమని పెద్దలు చెప్పుచుందురు. ప్రసక్తానుప్రసక్తిగా నిది వచింపబడినది.

ఇక అధ్యవసాయిని యగుబుద్ధిని గూర్చి విచారింతము. ధర్మాధర్మములు- ఐశ్వర్యానైశ్వర్యములు- అణిమాది సిద్ధులు- కామక్రోధాదులు- సంసారజ్ఞానము- ముక్తిజ్ఞానము- మోహాజ్ఞానము- మొదలగునవి అధ్యవసాయిని యగు బుద్ధివ్యాపారములు. బుద్ధి తత్వమునుండియే అహంకారతత్వము జనించినది.

సాత్వికాహంకారము- రాజసాహంకారము- తామసాహంకారము- అనియహం
కారము- మూడు విధములు- సాత్వికాహంకారము నుండి మనస్సు చక్షురాదిజ్ఞానేంద్రి
యపంచకము జనించినది.

రాజసాహంకారము నుండి వాగాదికర్మేంద్రియ పంచకము జనించినది. తామసా
హంకారమునుండి పంచతన్మాత్రలు జన్మించినవి. పంచతన్మాత్రలకాధారము పంచభూ
తములు. పంచభూతములతో నేర్పడినది గనుకనే యీశరీరము పాంచభౌతికమని వ్యవ
హరింపబడుచున్నది.

## కర్మపాశము.

పెద్దలు వేదాంత విషయములు చెప్పుచుండగా వినుటకు పోకుండనడ్డుపెట్టును.
జన్మమును- భోగమును- ఆయువును కర్మయే యొసంగును. అధిభౌతికమని ఆధ్యాత్మికమని
అధిదైవికమని కర్మకు మూడు సాధనములు గలవు. త్రిసాధనములన తాపత్రయమనిపేరు.

## అధిభౌతిక తాపము.

పాములు- తేళ్లు- నల్లులు- చీమలు దోమలు- మొదలగు దుష్టజంతువులవల్ల కలు
గు బాధలును కళత్ర పుత్ర భ్రాతృమిత్రాదులవలనగలిగిన వ్యాధులు మొదలగు వాని
వలన తాను దుఃఖపడుటయును ఆధిభౌతిక తాపము.

## ఆధ్యాత్మిక అధిదైవిక తాపములు.

జ్వరము- వాతము- శూలము- మున్నగు రోగములు దేహమునకుగలిగిన నపుడు పొం
దుఃపరితాపమే ఆధ్యాత్మిక తాపము. అతివృష్టి- అనావృష్టి- ఝంఝామారుతము- పిడుగు
లు పడుట మొదలగు దైవకృతములగు బాధలవలనతనకుగలుగు పరితాపమే అధిదైవికము.

ఈత్రిసాధనములుగల కర్మమనుభవించినగాని పోనేరదు. ఆగామి సంచిత ప్రా
రబ్ధములని కర్మభేదములు గ్రంథాంతరమున గలవు. ఆగామిసంచితములు తానార్జిత పుణ్యక
ర్మల వలన నశించ వచ్చునుగాని "ప్రారబ్ధం భోగతో నశ్యేత్" అని అనుభవించిగాని ప్రా
రబ్ధము నశించదు.

## శివాద్వైతము.

ప్రారబ్ధ మనుభవించుచు శివభక్తి శివజ్ఞానము గలిగి శివపూజాది సత్కర్మలాచ
రించుచు శివానుగ్రహమునకు బాత్రులైనగాని పశువులు పాశపంచకము తప్పించుకొని శి
వసాయుజ్యము నొందనేరరు. మలినత్వము పోయినపుడు శివత్వము గలుగును. శివసాక్షా
త్కారము వలననే మలనివృత్తి గలుగును.

శ్లో. అహం మహాత్మా శివో హ్యన్యః పరమాత్మేత్యతి యస్స్మృతః ।
ఏవం యో భావయే న్మోహాత్ నశివత్వమవాప్నుయాత్ ॥

నేను జీవుఁడను, పరమాత్మయగు శివుఁడు నాకంటె నితరుఁడు. అను భావనలో నెవఁడు పరశివుని తలంచునో, వాఁడు శివత్వము పొందఁడు.

శ్లో. దేహో దేవాలయః ప్రోక్తో జీవో దేవ స్సనాతనః ।
త్యజేదజ్ఞాన భావంచ సోహం భావేన పూజయేత్ ॥

ఈదేహమే దేవాలయము. ఇందు గల జీవుఁడే సనాతనుఁడైన దేవుఁడు. కావున అజ్ఞానభావనమును విడిచి ఆశివుఁడే నేనను భావనమున పూజింప వలయును.

కొందరు నేనేపరబ్రహ్మను అని పలుకుదురు. అట్టివారు పైవాక్యములకు విపరీతార్థమును చెప్పువారగుచున్నారు.

ఎప్పటికిని తాను భావించునపుడు, ఆపరశివుఁడను నేనని యెంచవలయును" సర్వజ్ఞానోత్తరాగమము నందు,"శ్లో. యశ్శివ స్సోహ మేవేతి అద్వైతంభావయే త్సదా అనగా నేమహాను భావుఁడు శివుఁడని రచింపఁ బడుచున్నాఁడో, అతఁడే నేనను, అద్వైత భావనతో ధ్యానించిపూజించవలయునని చెప్పఁబడినది.

కావున, అటుల శివుని భావించి పూజించుటయే శివాద్వైతము. ఇదియే లింగైక్యమని మతధర్మపారగుఁడగు పాల్కురికిసోమనారాధ్యులవారు తాను రచించిన చెన్నమల్లు సీసము లందుఁగూడ వచించియున్నారు.

సీ. నేకర్త వటన్న ◆ నిక్కంబు భక్తుండు । తానవ్వ నుభయాక ◆ ర్మావృతగతుఁడు ।
నీవె యన్నను సదా ◆ నిత్యత ప్రసాదాంగి । తనకన్న నింద్రియ ◆ తప్తుండు ।
నిన్ను నెఱింగిన ◆ నెట్టన శరణుండు । తన్ను నెఱింగిన ◆ తామసుండు ।
నీవు తానన్నను నిజము లింగైక్యుండు । తాను నీవన్న న ◆ ద్వైతవాది ।
గీ. కాన కాయకర్మ ◆ గతిమతి శుద్ధిచె । తన్య భావములను ◆ తన్ను మరచి ।
లింగగతి చరించు లింగలింగైక్యుల । చేర్పవయ్య నన్ను ◆ చెన్నమల్లు ॥

కావున సోమనాథుని వంటి భక్తితత్పరుఁడు శివుఁడే తానని భావన చేయుటయే లింగైక్యమని వచించుచున్నాఁడు. శివాద్వైతమనిన నిదియే, ఇట్టి పరశివుని భావించిపూజించుటకు దీక్ష నొంద వలయును. అట్టి దీక్ష నొందినగాని పాశపంచకము నశించి పశువు పశుత్వమును విడిచి లింగైక్యము నొందనేరఁడు. కాన నట్టి దీక్షను ప్రసాదించుటకు గురువు సమర్థుఁడు. పూజ్యుడును పరశివస్వరూపుఁడు నగు గురువుతనకనుగ్రహముగ లిగినగాని శక్తిపాతమున షడధ్వశోధనఁ జేసి దీక్ష నొసగఁడు. ఈవిషయమును నే ముందు ప్రకరణములందు క్రమముగ నిరూపించును.

## శివజ్ఞాన శేఖరే,

### పంచమ ప్రకరణం.



గురుస్తుతిః.

శ్లో॥ శివజ్ఞాన క్రియా రూప దీక్షా కారుణ్యాపేక్షయా ।
కృతార్థయంతం జిజ్ఞాసూన్ గురురూపం శివంభజే॥

శక్తిపాత ప్రశంసా.

శ్లో॥ యత్కటాక్ష నిరీక్షాయాం ప్రాల్బంతే జడా అపి ।
గురోస్తస్య ప్రసాదాఖ్యం శక్తిపాతం ప్రచక్ష్మహే ॥

శక్తిపాత నిరూపణం.

తథాహి॥ శక్తిరపి అనాది మల నివృత్త్యా భవతి। తస్యానివృత్తిశీల త్వం ప్రాగేవోక్తం ॥

మృగేంద్రే సూత్రే ॥ తదేకం సర్వభూతానాం మనాది నిబిడం మహత్ । ప్రత్యాత్మస్థస్వకాలాంతా పాయి శక్తి సమూహవత్ । ఇతి

---

గురుస్తుతి.

ఏపరశివుండు గురు రూపమును ధరించి అనుగ్రహ కటాక్షముచే దీక్ష నొసంగి జిజ్ఞాసువులను కృతార్థులఁగా జేయునో, గురుస్వరూపుఁడైన యట్టి శివునకు నానమస్కారము.

గురుకృపాప్రశంస.

ఏగురు కృపాకటాక్ష లేశముచే మూఢులును తరించుచున్నారో, అట్టి గురుకృపారూపమైన శక్తిపాతమును వచింపుదును.

శక్తిపాత నిరూపణము.

శక్తికిగూడ అనాది మలముండును. గాని, యది నివర్తించును. ఈవిషయమై మృగేంద్ర సూత్రము వెనుకనే చెప్పబడినది.

స్వకాలాంశో నామ జ్ఞాన యోగభోగ సన్యాసచతుర్విధపరిపాకేణసర్వ కర్మక్షయఏవ తస్మిన్ సత్యేవ మలః పచ్యతే। తదైవ శివభక్తిర్జాయతే॥

తథాచోక్తం॥ అనేక జన్మసిద్ధానాం శ్రౌతస్మార్తానువర్తినాం। నరాణాం క్షీణపాపానాం శివభక్తిః ప్రజాయతే ॥ అపిచ ॥ జన్మాంతర సహస్రేషు తపోజ్ఞాన సమాధిభిః। నరాణాం క్షీణపాపానాం శివభక్తిః ప్రజాయతే ॥ ఇతి ఏవంవిధ పరిపక్వమలావస్థాత్మనః శివోప కార్యం దర్శయతి ॥

యజ్ఞవైభవ ఖండే॥ మహాదేవో మహానందో మహాకారుణికోత్తమః। స్వాత్మభూతాం పరాశక్తింప్రేరయత్యేనసువ్రతాః ॥ ప్రసన్నా సా మహాదేవీ మహాకారుణికోత్తమా । శిష్యస్యాత్మని చిద్రూపా స్వయంపతతి నిర్మలా ॥

మృగేంద్రోత్తరే ॥ తమశ్శక్త్యధికారస్య నివృత్తేస్తత్పరిచ్యుతౌ । వ్యనక్తి దృక్క్రియానంత్యం జగద్బంధుగణో శ్శివః ॥

అస్యార్థః॥ తమః శక్త్యధికారస్యజ్ఞానక్రియా రోధకశక్త్యధికారస్య నివృత్తేరకారణాత్। తత్పరిచ్యుతౌ సత్యాం పరాత్మనః కైవల్యస్య సుఖభావేసతి । జగద్బంధుః జగదుద్ధరణలోలః। శివః పరమేశ్వరః అణోరాత్మనః । దృక్క్రియానంత్యం జ్ఞాన క్రియాభ్యాం అనవచ్ఛిన్నత్వం వ్యనక్తి వ్యంజయతి ॥

---

సర్వకర్మక్షయము గలిగినపుడు గాని మలము పరిపక్వదశ నొందదు, మలపరిపాకము గలిగినపుడు గాని, శివభక్తి జనించదు.

అనేక జన్మలందు పరిశుద్ధులై శ్రౌతస్మార్తాను వర్తులై క్షీణపాపులై యున్నమానవులకు గాని, శివభక్తి కలుగదు. ఎవరు వేలకొలది సంవత్సరములు జన్మలనెత్తుచు తపోజాననిష్ఠలవలన నశించిన పాపముగలవారలగుదురో, ఆట్టివారికి, శివభక్తి జనించును.

### శక్తిపాత చిహ్నాని.

అథ శక్తిపాత చిహ్నం దర్శయతి మృగేంద్రసూత్రే। యేషాం శరీరిణాం శక్తిః పతత్యైవానివృత్తయే। తేషాం తల్లింగ మౌత్సుక్యం। ముక్తౌ ద్వేషో భవస్థితౌ। భక్తిశ్చ శివభక్తేషు శ్రద్ధా తచ్ఛాసకే తథా॥

అన్వయార్థః। శరీరిణాం దేహినాం। యేషాం నివృత్తయే మలనివృత్తయే। పునరావృత్తయే శివశక్తిః పరమేశ్వరశక్తిః। పతతి। తేషాం తచ్ఛక్తిపాతయుక్తానాం తల్లింగం। తచ్ఛక్తిపాతలింగం చిహ్నం। ముక్తౌ మోక్షే। ఔత్సుక్యం ఇష్టార్థోద్యుక్తత్వం। భవస్థితౌ సంసారస్థితౌ। ద్వేషః అప్రీతిః। శివభక్తేషు పరమేశ్వర భక్తతత్పరేషు భక్తిశ్చ। తచ్ఛాసకే తచ్ఛివవస్తునః। శాసకే నిర్దోషం వినా శాస్త్రే శ్రద్ధాచ విశ్వాస ఏవ ఇత్యర్థః॥

---

ఇటుల మలపరిపాకము నొందిన జీవులకు శివు డుపకారము చేయును ఈవిషయమై యజ్ఞవైభవ ఖండమున జెప్పబడినది.

ఋషులారా! మహానందరూపుఁడు - కృపాశీలుఁడు - నగు మహాదేవుఁడు శివయందుగల పరాశక్తిని ప్రేరేపించును. ప్రసన్నురాలయిన యామహాదేవి శిష్యుని యాత్మయందు నిర్మలమగు జ్ఞానరూపిణియై పడుచున్నది.

జ్ఞానక్రియానునిరోధమందు శక్తియొక్క యధికారము పోయినది యగుచుండగా, పరమాత్మకు కైవల్యాభిముఖ భావము గలుగుచుండగా, జగదుద్ధరణము నందాసక్తిగల పరమేశ్వరుఁడు, తనకుగల జ్ఞానక్రియాధికారత్వమును ప్రకటించును. అని మృగేంద్రసూత్రమునఁగలదు.

### శక్తిపాతచిహ్నములు.

ఈశక్తిపాతచిహ్నములను మృగేంద్రసూత్రముచేత జూపించుచున్నాఁడు.

సుకృత పరిపాకమున, ఏజీవులయందు దయగలిగి పునరావృత్తి రాహిత్యమునకై పరమేశ్వరు నిర్మలమగు శక్తి పడుచున్నదో, అనగా శక్తిప్రవేశించుచున్నదో, ఆజీవులకు [అనగా ఆశక్తిపాతముతో గూడి యున్నవారలకు] మోక్షమునందాసక్తి - సంసారము

తథా యజ్ఞవైభవఖండే॥ శక్తిపాతేతు సంజాతే శిష్యస్యా
త్మని సంస్థితా। మాయా దగ్ధా భవేచ్ఛక్త్యా నాత్ర సందేహకారణం। స
ర్వసాధనసంయుక్త సాక్షాదాస్తిక్య సన్మతిః। మహాదేవస్య భక్తిశ్చ గు
రౌ శిష్యస్య జాయతే॥ గ్రంథాంతరే॥ జాతా సంసారపిండేస్మిన్ జుగు
ప్సాదోషదర్శినః। విరాగీ ప్రాప్తమోక్షస్య సంసారో హేయవస్తువత్

తథా మతంగ పారమేశ్వరే॥ తన్నిపాతాచ్ఛక్తేస్యైక సూక్ష్మ
స్యాప్యభిలాషిణః। బుద్ధిరుత్పద్యతే కస్మాద్వివేకే నాత్మవర్తినా। వి
వేకినో విరక్తస్య జిజ్ఞాసా చోపజాయతే। జిజ్ఞాసాపేత చైతన్యం పశుం
సంసారసాగరాత్। జిహీర్షుర్మాయయా నత్యైనం యుక్త్యం ప్రేరయతి ప్రభుః॥

అస్యార్థః। అజ్ఞస్య అనాత్మరూపభోగసాధనేషు। ఆత్మసుఖ
యుక్తస్య అభిలాషిణోపి భోగసాధనేషు అభిలాషయుక్తస్యాపి తన్ని
పాతాత్ తచ్ఛక్తిపాతనాత్। తస్య తచ్ఛక్తిపాతయుక్తస్య। ఏకస్య జ
నస్య ఆత్మవర్తినా అనిత్యాశుచిదుఃఖే నాత్మరూప ప్రవర్తిదశాయాం
అన్యః। అహం చేతనాత్మకః అస్వతంత్రః। స్వసంవేదనసిద్ధః పరమే
శ్వరాధిష్ఠితోహమితి ప్రకారేణ ఆత్మవర్తినా వివేకేన యుక్తా బుద్ధిః

---

నందు ద్వేషము- [శివాగమ అపేక్షిత,] పరమేశ్వరుని యందును, పరశివభక్తుల యందును భక్తి
యు, అట్టి భక్తిని బోధించు శైవగ్రంథముల యందు విశ్వాసమును గలుగును.

ఈవిషయము గూర్చి యజ్ఞవైభవఖండమునందు గూడ జెప్పబడినది.

శక్తిపాతము గల్గినచో, శిష్యుని యాత్మయందున్న మాయ తొలగబడిపోవును. ఇం
దుకు సందేహము లేదు. సర్వసాధనములతో గూడిన ఆస్తిక్యబుద్ధి గలుగును. మహాదేవుని
యందు భక్తి కుదురును. తిమాప్రుడైన గురువునందు భక్తి యతిశయించును. సంసారము
నందు విరక్తియు, అసహ్యము గలుగును. మోక్షమునందు ప్రేమ గల్గును అని గ్రంథాంతరము
నగలదు.

మతంగ పరమేశ్వర శాస్త్రమునందీ క్రింది విధముగా రచింప బడినది.

అజ్ఞుడయినను, లేక భోగసాధనములందు నభిలాష గల వాడయినను -

మతిః। తస్మాత్కారణాంతరానపేక్షశక్తిపాతమాత్రాద్దుష్ప్రాప్యస్యాపి వివేకినో విరక్తస్య భోగసాధనేషు వీతరాగస్య జిజ్ఞాసా పరికృతిరూప సంసారనివృత్తి కారణ పురుషేశ్వరస్య రూపం జ్ఞాతు మిచ్ఛాచ శబ్దేన హేయ వైరాగ్య ముపదయతే ॥ పరిభుః పరమేశ్వరః జిజ్ఞాసాపేత చైతన్యం జిజ్ఞాసా పురుషేశ్వర స్వరూపం జ్ఞాతు మిచ్ఛాతయోపేతం చైతన్యం జ్ఞానం యస్య తం తథోక్తం పశుం పరిపక్వమలం పురుషం సంసార సాగరాత్సంసారః పరికృతిరూప। సదృశః సాగరస్సముద్రః। తస్మాజ్జిసృక్షు నాశిద్ధర్తు మిచ్ఛయా యునక్తి సంగచ్ఛతే। యుక్త ముద్ధర్తుమిచ్ఛాయుక్తం ఏవ మాత్మానం ప్రేరయతి తజ్జిజ్ఞాసా విషయ పురుషేశ్వరస్య రూపజ్ఞాతారం శ్రీగురుం పతిప్రేరణాం కరోతీత్యర్థః॥

తథాచోక్తం తత్త్వప్రకాశే॥ పరిపక్వమలానేతానుత్సాదనహేతు శక్తిపాతేన। యోజయతి దీక్షయాసశ్శంభుశ్చాచార్య మూర్తిస్థః॥ అపిచ॥ శక్తిర్నిపతతే తస్య। నివృత్తస్య మహాత్మనః। వైరాగ్యం జాయతే క్షిప్రం సంసారే దుఃఖసాగరే। దిదృక్షా జాయతే శంభోః పాదపంకజయోరపి। కథం వక్ష్యామి దేవేశ। మోక్ష్యేఽహం బంధనాత్కథం। కో వా దర్శయితా శంభుం ఇతి సంజాయతే మతిః। ఏవం సంసారత్రాసభీతమనుగృహ్ణాతి చేశ్వరః॥

---

శక్తిపాతముగల జీవునికి, మహాత్ముగ్చుదుకు నీసంసారదశ యుండును "నేను అస్వతంత్రుడను. పరమేశ్వరుఁడే నాకధిపతి" యనువివేకము మరియే యితరకారణము లేకుండగనే శక్తిపాత మాత్రము వలననే జనించును.

భోగములందు వీతరాగుఁడైన వివేకిక్షేత్రజ్ఞునకు, శక్తిపాతమాత్రమున- ఘోరసంసారమునుండి దాటింప సమర్థుఁడైన పరమేశ్వరుని రూపము కనుగొనుటకు- లేక తెలిసికొనుటకు అభిలాషయును- తిరిగిరము లైన వస్తువుల యందు- జుగుప్సయును కలుగును.

మలపరిపాకము గలిగి నట్టియు, పురుషేశ్వర స్వరూపమును, తెలిసికొన కుతూహ

ఏవం విధశక్తిపాతస్థితస్యాత్మనః । శివకళాభోగ్యత్వం దృష్టాంతపూర్వకం కిరణసూత్రేణ దర్శయతి ॥ గురుర్యథాగ్రితః శిష్యాన్ సుప్తాన్ దండేన బోధయేత్ । శివోఽపి మోహనిద్రాణాం । సుప్తాన్ శక్త్యా ప్రబోధయేత్ ॥ అస్యార్థః ॥ గురుః ఆచార్యః । అగ్రితః సుప్తాన్ నిద్రితాన్ శిష్యాన్ శిక్షాయోగ్యాన్ యథాదండేన బోధయేత్ ప్రబోధనం కుర్యాత్ । తథా శివోఽపి మోహ నిద్రాణాం అజ్ఞానహేతుమల నిద్రాణాం సాక్ష్యాం చైతన్య సంరోధకే స్వకార్యే అసమర్థరూప పరిపాకవిశేషే సః సుప్తాన్ తదపాకరణోపాయజ్ఞానస్య అన్యాన్ శిథిలమలావృతాత్మనః । శక్త్యా అనుగ్రహ. శక్త్యా ప్రబోధయేత్ ॥ తత్పరిపక్వమలమపనీయ అభివ్యక్త చైతన్యాన్ కుర్యాదిత్యర్థః ॥

ఏవం ఈశ్వరానుగ్రహ శక్త్యాఖ్య వ్యంజక సంబంధేన ఆత్మనస్తత్కాలే ప్రసిద్ధసర్వాంశో ముఖచైతన్య మభివ్యక్తం భవతీతి దృష్టాంతపూర్వకం కిరణసూత్రేణ దర్శయతి ॥ యథా భేషజసామర్థ్యాత్ దశిక్తానాంబలంకరం । తేన తచ్ఛక్తియోగేన సామర్థ్య మమితం భ

---

లము గలిగినట్టి, యునగు పశువును సంసారసాగరమునుండి తరింపఁ జేయనిచ్ఛ గలిగి సర్వలోకాధిపతియైన పరమేశ్వరుఁడు పురుషేశ్వర స్వరూపమును గుర్తెరింగిన వాఁడును, తనస్వరూపమును ధరించిన వాఁడును నగు గురువుగూర్చి ప్రేరేపించు చున్నాఁడు.

తీవ్రప్రకాశము నందు గూడ నిటులే వచింపఁ బడినది.

పరశివుఁడు ఆచార్యమూర్త్యధిష్ఠించి మలపరిపాకముగల వారిపై శక్తిపాతమును సంయోజనము చేయును.

ఎపుడు జ్ఞానరూపముగ శక్తి ప్రవేశించునో, అపుడే సంసారమున వైరాగ్యము కలుగును. ఈశ్వరపాద పద్మముల యందు భక్తియు జనించును. ఓ శంకరా ఈబంధము నాకెటుల తొలఁగును? ఎవరు పరశివుని జూపింతురు? సంసార భయముగలిగిన నన్ను శంక

వేత్ ॥ అశక్తానాం వ్యాధినా సామర్థ్యహీనానాం భేషజ సామర్థ్యాత్ ఔ
షధసామర్థ్యాత్ । యథా పరం శ్రేష్టబలం ప్రసిద్ధ సామర్థ్యం భవేత్ ॥
తథా తేనతచ్ఛక్తి యోగేన శివానుగ్రహ శక్తిసంబంధేన అనాదితం దే
శకాలాభ్యాం పరిచ్ఛేదరహితం । తత్ప్రాక్సిద్ధ సామర్థ్యం । జ్ఞానక్రియా
రూప సామర్థ్యం భవతి అభివ్యక్తమితి సూత్రార్థః ॥

తచ్చైతన్య వ్యంజకే శివశక్తిరూపం దర్శయతి ॥ కాలోత్త
రే ॥ విశ్వస్యానేకరూపస్య జ్ఞానమేకం హి చాత్మకం । వ్యాపకం వి
మలం శాంతం భుక్తిముక్తించ యేనతత్ ॥ అస్యార్థః ॥ అనేకరూపస్య
అత్యంత పరిష్కృతిచతుర్దశ విధసర్గయోగ్యతాబహుతరసమ యోగ్యతా
మందతరమందతీవ్రతర పరిపాకితా సాధికార నిరధికారత్వాది భే
దా ద్యనేకరూపస్య । విశ్వస్య శ్యామలత్రిమలభేద నోభయ విధస్యస్వ
దేహి విదేహి భేద నోభయవిధస్య । ఏకైక ద్విభేదేనాష్టవిధస్య పక్వా
పక్వభేదేన చతుర్విధస్య ఏకైకస్య ద్విభేదేన అష్టవిధస్య ఇత్థమష్టవి
ధ సకల వర్గ పక్వాపక్వభేదేనద్వి ప్రకార ప్రళయకేవలవర్గవిజ్ఞా
న కేవల వర్గసమస్తాత్మ సమూహస్య యేన భుక్తిం ముక్తిం సద్ధార్థభో
గ పరాపర మోక్షానిచ శబ్దేన సృష్ట్యాదికృత్య పంచకంచసిధ్యతి । శి
వాత్మకం శివస్వరూపం తత్ జ్ఞానమేక మద్వితీయం వ్యాపకం సర్వగ
తం విమలం నిర్మలం శాంతం । రాగద్వేష విరహితమితి సూత్రార్థః ॥

---

రుడెట్టుల ననుగ్రహించును? అని జీవుడు తలంచు చుండును.

ఈవిధముగ శక్తిపాతము గలిగియున్న యాత్మకు శివకళా భోగ్యత్వమెట్టుల గలుగునో, ఆవిషయము కిరణసూత్రము నందు చెప్పబడినది.

ఎట్టుల గురువుతనపురోభాగమున నిద్రించిన శిష్యులను దండముతో మేలుకొలుపునో, అటులే శివుడు మోహ నిద్రయందు నిద్రించువారిని శక్తిచేత మేలుకొలుపును. అనగా పరిపక్వమైన మలముగల వారిని ప్రకటించ బడిన చైతన్యముగల వారినిగా జే

అథ పూర్వోక్తలక్షణయుక్తం శక్తేః ఏకత్వం। శివసమవేతాత్త్వప రాపరజ్ఞాన రూపత్వాని కథయిత్వా శివావినాభూతా శక్తిరేకా సైవ శివావలోకనాదిషు ఆత్మనః ఆత్మానుగ్రహాదిషు శివస్య సాధన రూపేణ వర్తతే ॥ విశ్వాసకారిణా సార్ధసూత్రేణ దర్శయతి ॥ ఏకేవ స్తుతః శైవీ। యా శక్తిర్నిర్మలా పరా। అవినాభావినః శంభో శ్శుచే రుష్ణత్వవత్ప్రభో। తయా శివాత్మనో స్సంధి శ్శివశాభావపరాపరా ॥ పరా ఉత్కృష్టా శుచే రగ్నే ఉష్ణత్వవత్ దాహకత్వ మివప్రభోః ప్రభవనశీలస్య శంభోః పరమేశ్వరస్యావినాభావ సంబంధినీ శివబోధ పరా పరశివబోధే పరాపరజ్ఞానరూపా శైవీ శివసంబంధినీ యా వస్తుత ఏకైవ శక్తిస్సంవిచ్ఛక్తిః తయా శివసమవేతశక్త్యా ఆత్మశివయో రాత్మనః శివస్య సంబంధి సంధానం భవేదితి సార్ధసూత్రార్థః ॥

శివస్యచైతన్య వ్యంజక శక్త్యాఖ్య శివజ్ఞానస్య వ్యంజక నిరపేక్షత్వాత్ । వ్యంజకాపేక్షత్వం నాస్తీతి నైవకారణేన సంశయతి ॥ పర్యాయానవ్యవసాయాత్వమస్త్యేవనిత్యవ్యాపకత్వేన విరాజమానత్వం చేతివ్యాకేందరిసూత్రేణదర్శయతి॥ నాపేక్షం నాపితల్లింగం నశాబ్దమపి శాంకరం । జ్ఞానమాభాతి విమలం సర్వదా సర్వవస్తుషు ॥ అస్యార్థః॥ విమలం నిర్మలం శాంకరం పరమేశ్వర సంబంధిజ్ఞానం నాపేక్షమిం

---

యాను.

ఈశ్వరుని యనుగ్రహరూపమగు శక్తి సంబంధముచే, ఆత్మకు నాసమయమున పూర్వమందే సంసిద్ధమై యున్న స్వాత్మోన్ముఖ చైతన్య మభివ్యక్తమగును. అనికిరణసూత్రమున నీక్రింది విధముగ వచింపబడినది.

వ్యాధిగ్రస్తులకు ఔషధ సేవనము వలన పురాతన మంచు తనకు కలిగి యున్న బలమెటుల సంభవించునో అటులనే మల పరిపాకములుగల వారికి, శివానుగ్రహశక్తి సంబంధమున జ్ఞానక్రియారూప సామర్థ్యములు గలుగును.

ద్విహా సేత్యుప్రత్యక్షజ్ఞానం సలైంగమపి. గజవత్ మనుమాన జ్ఞానం శా బ్దమపి శబ్దజవత్ మాగమజ్ఞానం తత్ తచ్ఛివజ్ఞానం సర్వదా సార్వకా లే సర్వవస్తుషు సమస్త పదార్థేషు ఆభాతి ప్రకాశయతి ॥

అథ జ్ఞానప్రవృత్తే ర్నిమిత్త ముపకార్యం ప్రయోజనమితి త్రి విధలక్షణాని స్వాయంభువసూత్రేణ దర్శయతి॥ అథాత్మమల మాయా ఖ్య కర్మబంధ విముక్తయే। వ్యక్త్యేచ శివత్వస్య శివజ్ఞానం ప్రవర్త తే ॥ అథ అనంతర మాత్మనాం మలః మలనివృత్తిహేతుః మలరోధ శక్తిర్వా మాయాతదాఖ్యా శుద్ధాశుద్ధ మాయా నామకర్మ తదేన

---

## శక్తిరూపనిర్ణయము.

ఆచైతన్యవ్యంజకమగు శివశక్తిరూపము కాలోత్తరమునందిట్లు వచింపబడినది.

ఈ పదునాలుగు భువనముల యందుగల జీవులందు సమానయోగ్యత గలవారు కొందరు, అసమానయోగ్యత గలవారు కొందరు, అల్పమలపరిపాకముగలవారు కొందరు, అధికమల పరిపాకముగలవారు కొందరు, అల్పానల్పమల పరిపాకము గలవారు, అధికారముగలవారు కొందరు, అనధికారముగలవారు కొందరు, అధికారానధికారములు గల వారు కొందరు, మలద్వయముగల వారు కొందరు, మలత్రయము గలవారు కొందరు, స్వదేహముగలవారు కొందరు, విదేహముగలవారు కొందరు, ఈ నలుగురి లోపక్వాపక్వముల భేదము అష్టవిధస్వరూపముగలిగి సకలులను జీవులు ప్రకాశించుచున్నారు.

వీరిలో ప్రళయాకలులని విజ్ఞానాకలులనియు రెండు భేదములు గలవు ప్రళయ కేవల వర్గము- విజ్ఞానకేవలవర్గము సకలవర్గమువను నీయాత్మ సమూహమునకు దేని చేత, భుక్తిముక్తులును- శుద్ధాశుద్ధభోగ పరాపరమోక్షములును గలుగుచున్నవో, సర్వ వ్యాపకమై అద్వితీయమై చరాచర ప్రపంచమంతటను నిండియుండి నిర్మలమును శాంతమునునగు నట్టి శివస్వరూపమైన జ్ఞానమే శక్తి యని వ్యవహరింపబడినది.

పూర్వోక్తలక్షణ సహితమైన శక్తికి నేకత్వమును, శివసమవేతత్వమును- పరాపరజ్ఞాన రూపత్వమును జెప్పి శివునికంటె నవినాభూతమై వెలయుశక్తి యొకటియే, అది శివాపలోకనాముల యందు ఆత్మానుగ్రహార్థమై శివునికి సాధనముగా ప్రవర్తించుచున్నది. అ

బంధఃపాశస్తస్య విముక్తయే విమోచనాయ శివత్వస్యసర్వవిషయ జ్ఞానక్రియారూప శివత్వస్య అభివ్యక్తయేచ జ్ఞానం శివసమవేత చిచ్ఛక్తిరూపజ్ఞానం శివాత్ పరం శివాత్ ప్రవర్తతే నాదాదిరూపేణ ప్రవర్తత ఇత్యర్థః ॥

అపిచ ॥ తత్త్వప్రకాశే ॥ భుక్తిం ముక్తిం మణూనాం స్వవ్యాపారే సమర్థతా । దానంజడవర్గస్య విధత్తే సర్వానుగ్రాహకః శ్శంభుః॥ అతి మోక్షదుఃఖనివృత్తి కారణేన అనుగ్రాహకో భవతి సుఖదుఃఖహేతుర్భోగః కథ మనుగ్రాహకో భవతీత్యాశంక్య సంచితకర్మణాం భోగేన వినాకర్మక్షయో నస్యాత్ ॥ నాభుక్తం క్షీయతే కర్మ ఇతి వచన ప్ర

---

యీవిషయమును విశ్వప్రకాశికా సూత్రార్థము వచింపుచున్నాడు.

అగ్నియందు ఉష్ణశక్తివలె నీశ్వరుని యందు వినాభావరూపముగ నున్నట్టియు, ఉత్కృష్టమైనట్టియు, శివబోధయందు పరాపరజ్ఞానరూపము గలిగినట్టియు, శివసంబంధిని యగు నాజ్ఞాశక్తి ఆత్మశివులకు సంధానకారిణియై ప్రకాశించు చుండును.

చైతన్యమును సూచనచేయు నాశివశక్తికి వ్యంజకమైన పదార్థము లేదు. అదియే నిత్యవ్యాపకమై వెలయుచున్నది. ఈవిషయము మృగేంద్రసూత్రమున నుడువబడినది.

నిర్మలమగు నాపరమేశ్వరసంబంధి జ్ఞానము ఇంద్రియములచే నపేక్షించబడు ప్రత్యక్షజ్ఞానము కాదు. అను మానిక జ్ఞానము కాదు. శబ్దజన్యజ్ఞానము కాదు. అది సర్వకాలములందు సర్వవస్తువులందుఁ బ్రకాశించు చుండును.

ఇట్టి జ్ఞానప్రవృత్తికి ప్రయోజనము జీవుల కొఱకు నుపకారము చేయుటయే యనిస్వాయంభువ సూత్రమున వచింపబడినది.

ఆత్మలయొక్క మలనివృత్తి కొఱకును శుద్ధాశుద్ధమాయాకర్మ బంధపాశము కొఱకును, జ్ఞానక్రియారూపమైన శివత్వ ప్రకటన కొఱకును, సమవాయ సంబంధమున, అనగా అవినాభావరూపమున శివునియందు, శివునియందున్న చిచ్ఛక్తిరూపమగు జ్ఞానము శివునికంటె వేరయి నాదాదిరూపముగను ప్రవర్తించుచున్నది.

ఈవిషయము తత్త్వప్రకాశమునందిటుల పలుకబడినది.

భాష్యమ్ ॥

కర్మక్షయం వినా మోక్షో న సిధ్యతి ॥ అత్రోక్తం । చిదచిదనుగ్రహ స్వాయంకల యో మోక్ష శ్శివసమానతారూపం । సాధికారకర్మణా హి భోగస్తేన యాతి సంసిద్ధం । తేన విభు స్సద్భక్తం శంకరు తేతను కరణ భువననివృత్తిః । ఇతి గ్రంథానుసారేణ భోగమోక్షాణాం ఈశ్వరానుగ్రహం వినా న సిద్ధి ॥

అత్ర పశుత్వం బద్ధచిచ్ఛక్తి రితి పశుప్రకరణే నోక్తం । తత్ర భోగాత్ కర్మక్షయ ద్వారా పశుత్వక్షయేన ఆత్మనః చైతన్యం స్వయమేవాప్నోతి ॥ ఈశ్వరానుగ్రహం కింప్రయోజన మిత్యాశంక్య తచ్చైతన్య మనంతకాల మలనిరుద్ధత్వకారణేన జడం భవతి ॥

తస్మాత్కారణాత్ మలనివృత్త్యోపి ఈశ్వరానుగ్రహ మపేక్షత ఇతి మృగేంద్రసూత్రే ఆహ ॥ నిత్య వ్యాపక చిచ్ఛక్తి సిద్ధి రప్యర్థసిద్ధ

---

సర్వానుగ్రహముగల శంకరుండు, అణుస్వరూపులగు జీవులకు భుక్తిముక్తుల నొసంగుటయేగాక, అమితమవ్యాపారములందు సామర్థ్యము నొసంగును.

మోక్షప్రాప్తి గల ప్రతిబంధము నివర్తించుటచేత అనుగ్రహముగల వాడగును.

సుఖదుఃఖములకు గారణమైనది భోగము. అట్టి భోగానుభవమున్నపుడు శంకరుడు జీవుల ననుగ్రహించుననిశంకించికొని, సంచితకర్మగలవారలకు అనుభవములేకుండ కర్మక్షయముగా నేరదు కావున నే " నాభుక్తం క్షీయతే కర్మ " అనగా అనుభవించనిది కర్మనశించదని శాస్త్రము చెప్పుచున్నది. కాబట్టి కర్మక్షయము గానిది మోక్షము సంభవింపదు.

చిదచిదనుగ్రహముగలిగి శివసాయుజ్యము నొందుటయే మోక్షము. కర్మానుభవము లేక దానిని నశింపజాలదు. ఆకారణముచేతనే ప్రభువగు శంకరుండు తదనుభవమును నాత్మలకు నేర్పరచెను. అని గ్రంథాంతరమున గలదు.

కావున నీశ్వరానుగ్రహము లేనిది భోగమోక్షములు సిద్ధించవు.

అనుభవమువలన కర్మనశించును. కర్మనశించిన యపుడు పశుత్వము పోవును. పశు

యే । పాశవం శాంభవంవాపి బలమన్వేష్టినా న్యథా॥ అన్వర్థః॥ నిత్యవ్యాపకచిచ్ఛక్తి నిధిరపి నిత్యాయాః చిచ్ఛక్తేః దృక్క్రియాశక్తి రూపిణ్యా అర్థసిద్ధయే భోగమోక్షప్రయోజనసిద్ధయే పాశవం కలాభివ్యంజకరూపం వా అథవా శాంభవమపి శివసంబంధి క్రియాశక్త్యనుగ్రహరూపం వా బల సామర్థ్యం మన్వేష్టే. అపేక్షతే ॥

అన్యథా అన్యథాచేత్ నాన్వేష్టేచేత్ భోగమోక్షౌ నస్యాతా మిత్యర్థః ॥

ఏవమీశ్వరానుగ్రహశక్త్యా ప్రబోధితాత్మనః ఆచార్యమూర్తిః పరమేశ్వరఏవ పరస్పర మనువ్యంజయతీతి పరాఖ్యసూత్రేణ దర్శయతి॥ ప్రేర్యశ్చ[రణి] ప్రేరక శ్చైత్రమాత్ర ద్వయోరపి సమంత్రరాట్ । అనుగ్రాహ్యస్య వినయే తథానుగ్రాహకస్యచ । కారుణ్యాదస్య యోరత్య స్మాత్ప్రయోగ స్సుదుర్లభ ఇతి ॥

---

త్వముపోయిన వెంటనే యాత్మకు స్వయముగా చైతన్యము గలుగును గదా ! ఇక ఈశ్వరానుగ్రహముతోనే మిప్రయోజనము? అనితలంప గూడదు.

ఆత్మయందు గల చైతన్యము చిరకాలము నుండి మలముచే నిరోధింప బడియుండుటచేత జడత్వము నొందియుండును. అందువలన మలము నశించినను నీశ్వరానుగ్రహమునది యపేక్షించును. ఈవిషయమును పృగేందరసూత్రమున గలదు.

నిత్యవ్యాపకమగు చిచ్ఛక్తికి నిధియయినను భోగమోక్షప్రయోజనసిద్ధికొరకు కలాభివ్యంజకరూపమైనట్టిగాని, శివసంబంధమైన క్రియాశక్త్యనుగ్రహరూపమైనట్టి గాని బలమును నాత్మయపేక్షించును. లేనిచో, భోగమోక్షములు లేకపోవును.

ఈవిధముగ నీశ్వరానుగ్రహశక్తిచే నాత్మబోధముగాంచు ఆచార్యుడు పరమేశ్వరుడేగాని మానవుడుగాడు పరాఖ్యసూత్రమున పరస్పరసంబంధము నిరూపింపబడినది.

ప్రేరకుడొకడు ప్రేరేపింపబడువాడొకడు అనుగ్రాహకుడొకడు. అనుగ్రహింపబడువాడొకడు. పరమేశ్వరగురువుల కవినాభావము. అట్టి గురు కారుణ్యము కలుగుట మిక్కిలదుర్లభము.

### అథ శ్రీగురులక్షణం వక్ష్యామః॥

#### గురులక్షణం.

శ్లో. నిత్యానిత్య వివేకవా నిహపరత్రాపేక్షితార్థారతిః। శాంత్యాద్యంగ సమన్విత స్సుచరితో మోక్షే దిశోత్సుక్యవాన్। సత్యానందపరప్రకాశ పరిపూర్ణాత్మావబోధాన్వితః। కృత్యాకృత్య వివేకవాన్ గురువరోపాయా స్సగోభక్తిమాన్॥కించ॥ స్వస్వరూపానుసంధానం జ్ఞానం యేనోపదిశ్యతే। ముముక్షో ర్మోక్షసిద్ధ్యర్థం జ్ఞానవాన్ గురురుచ్యతే॥ దుర్వార సంసృతి ధ్వాంతనిరోధ త్వే చిదంశుమాన్ గురుర్విజ్ఞాన మేవోక్తం స్వానుభూతాత్మతత్త్వవిత్॥ సుందర స్సుముఖ స్స్వచ్ఛ స్సులభ స్సర్వతంత్రవిత్। అసంశయ స్సంశయచ్ఛా నిరపేక్షో గురు స్స్మృతః। పాశమోక్షః పశూనాం హి యత్ర కారణ ఇత్యతః। పాశమోక్షకర శ్రీమాన్ సద్గురు శ్శివ ఇష్యతే॥ అగాధసంసారాణాం బోధేస్తరీ చానుగ్రహ ప్రదః। పరమోపాయ రూపత్వా ద్గురు రేవ పరశ్శివః॥

---

#### గురులక్షణము.

ఇక గురులక్షణమును వచింపుచున్నారు. గురు వెటువంటి వాడుగా నుండవలయునో, మనము దెలిసికొనవలయును. గాని, చూచినవారలందరు గురువులు గారు. గురువులందు దోషములున్నవో వది సవరించుకొనినగాని గురులక్షణము సమన్వయింపదు. గురులక్షణ లక్షితుడుగానివాడుగురువు కానేరడు. కాన గురులక్షణమును నిరూపించుచున్నారు.

గురువు నిత్యానిత్య వస్తువివేకియై యుండవలయును. ఇహమునందు పరభోగ మందప్రీతి గలవాడుగ నుండవలయును. శమదమాదులతో గూడిన వాడును, మోక్షమునందు ప్రేమగలవాడును, సచ్చరిత్రగల వాడును, సత్యానంద స్వరూపుడగు పరమాత్ముని దెలిసికొనినట్టి పరిపూర్ణమగు నాత్మబోధ వెలింగిన వాడుగను, కృత్యాకృత్య వివేకముగల వాడుగను, భక్తిగలవాడుగను గురువుండవలయును.

ఏమహానుభావునిచే మోక్షమునందభిలాషగల వానికి మోక్షసిద్ధికై స్వస్వరూపానుసంధానమగు జ్ఞానముపదేశింప బడుచున్నదో, అతడు జ్ఞాన గురువు.

పరమాద్వైత విజ్ఞానం యోపదేచ్ఛాచ్చరుకృపయా । సోయం గురువర స్సాక్షాచ్ఛివఏవ నసంశయః ॥ నాతిప్రదీపశిఖయా నచ రత్నదీప్త్యా నాపి ప్రభాకరకరైః ప్రతివారణీయం। అంతస్తమస్సకదిసశ్యతి యస్య భాసా। తేజోనిధి స్సగురురస్తుసదాప్రసన్నః॥ నిర్మలం నిష్క్రియంశాంతం ద్వంద్వాతీతం దయాపరం । సంబోధకం సదానందం । బ్రహ్మజ్ఞా శృతిసమ్మతం ॥ జితకామం జితక్రోధం సర్వత్ర సమదర్శనం। సర్వజ్ఞం సర్వరహితం సద్గురుం సమ్యగాశ్రయే ॥

అపిచ ॥ అతఏవ శివ స్సాక్షాద్గురురూపం సమాశ్రితః । భక్త్యా సంపూజితో దేవి భుక్తింముక్తిం ప్రయచ్ఛతి । మనుష్యచర్మణాబద్ధస్సాక్షాత్పర శివస్స్వయం। శిష్యానుగ్రహణార్థంతు గూఢం పర్యటతి క్షితౌ । సద్భక్త రక్షణాయైవ నిరాకారోపి సాకృతిః । శివః కృపానిధి ర్లోకేసంసారివత్ తిష్ఠతి ॥ నరవ ద్దృశ్యతే లోకే శ్రీగురుః పాపకర్మిణాం। శివ

---

స్వానుభవముగలిగి యాత్మవేత్తయయి విజ్ఞానస్వరూపుఁడయిన గురువు గాని, నివారింప శక్యముగాని సంసార భయమను చిమ్మచీకటిని బాల భానునిపగిది బాపఁదోలఁ జాలఁడు.

ఎవఁడు నిర్మలుఁడు- సుముఖుఁడు-సుందరుఁడు- సులభుఁడు- సర్వతంత్రజ్ఞుఁడు-నిస్సంశయుఁడు- నిరపేక్షగలవాఁడునై ప్రకాశించుచున్నాఁడో అట్టివాఁడేగురువని వచింపబడుచున్నాఁడు.

ఏమహాత్ముఁడు పశువుల పాశములఁ దెంపివైచి ప్రత్యాకారమును ధరించి యున్నాఁడో పాశమోక్షకరుఁడగు నాగురువే శివుఁడని నిరూపింపబడియున్నాఁడు.

ఏయాత్మజ్ఞాని, అగాధములైన సంశయములనెడు మహాసముద్రమునుండి తరింపఁజేయునదియమై నావవంటివాఁడో, అన్నిరూపములలో శ్రేష్ఠమైన యాయాత్మస్వరూపుఁడగు నట్టిపరశివుఁడే గురువు.

దయాశీలుఁడగునే పుణ్యపురుషుఁడు దయాళుఁడై పరమాద్వైతజ్ఞానమును బోధించునో, అతఁడు మానవుఁడు గాఁడు. గురూత్తముఁడు. సాక్షాత్తుగా శివుఁడే సుమీ దే

స్స దృశ్యతే సాక్షాన్మార్గాణాం పుణ్యకర్మణాం। గురుస్స ఏవ శివ స్స సాక్షాన్నాన్యమేవ న సంశయః ॥ శివ ఏవ గురుర్జ్ఞేచేత్ భుక్తింముక్తించ దాతిక।। దేశికాకృతి మాస్థాయ పశోః పాశాన శేషతః॥ ఛిత్వా పరంపదం దేవో నయత్యేవ ఇతి స్మృతిః। యథా ఘటశ్చ కలశః కుంభశ్చైకార్థ వాచకః। తథా దేవశ్చ మంత్రశ్చ గురుశ్చైకార్థ ఉచ్యతే॥

ప్రణామ విజ్ఞాపనాది లక్షణం

ఏవంవిధం గురుం లక్షయిత్వా। తదనంతరం ప్రణామవిజ్ఞాపనాదిలక్షణ మాహ। స్కాందే॥ నత్వా భక్తిపురస్సరం గురువరంవిజ్ఞాపయే

---

ప్రకాంతిచేఁ బోగొట్టబడని- రత్నకాంతిచే నశింపఁ జేయఁబడని, సూర్యకాంతిచే దిరస్కరింపబడని- యేమానసికాజ్ఞానాంధకారము, ఏతేజోనిధి తేజఃపుంజమున నశింపఁ జేయఁబడునో, అతఁడేగురువు. అట్టి గురువు ప్రసన్నుఁడగుఁగాక.

నిర్మలుఁడు-నిష్క్రియుఁడు- శాంతుఁడు- ద్వంద్వాతీతుఁడు- దయామయుఁడు- బోధకుడు- సదానందముగలవాఁడు. బ్రహ్మజ్ఞాని-వేదపారగుడు- కామక్రోధముల జయించినవాడు- అంతట సమదృష్టిగలవాఁడు- సర్వము తెలిసినవాఁడు నగు మహానుభావుఁడే సద్గురువని వచింపఁబడును.

కావుననే యెవఁడు గురురూపమును ధరించిన శివుని భక్తి శ్రద్ధలతోఁ బూజించునో, వానికి గురువు ప్రసన్నుఁడై భుక్తిముక్తుల నీయఁగలఁడు.

మానవదేహమును ధరించిన గురువు శివుఁడు కాని, ఇతరుఁడుగాఁడు. శిష్యానుగ్రహము కొఱకై గూఢముగా భూమియందు పర్యటనము చేయుచున్నాఁడు.

నిరాకారుఁడైనను భక్తరక్షణార్థమై సాకారుఁడై కృపానిధియగు నాశివుఁడే యీ లోకమున సంసారివలె ప్రవర్తించుచున్నాఁడు.

పాపకర్మముల నాచరించిన వారికి గురువు మానవుఁడుగను- పుణ్యకర్మముల నాచరించినవారికి సాక్షాచ్ఛివరూపుఁడుగను గురువు కన్పించును. ఇందుకు సందియంబు లేదు. శివుఁడే గురువు కానిచో నిక భుక్తిముక్తులెవ్వఁ డొసఁగఁగలఁడు,

దేశికాకారమును ధరించి శివుఁడు శిష్యులపాశముల నన్నిటిని ఛేదించి యుత్తమ స్థానము నొసంగును.

ఎటుల "కడవ" యనిన "చెంబు" యనినను "కుండ" యనినను ఏకార్థ వాచక

తాపప్లుష్టః। భిత్త్వా జన్మశతాగతాద్భవభయాద్భీతోఽస్మి మాంపాహి భో। యేనాయం భవపాదపస్సుఖఫల శ్శ్రేయం సమూలం ప్రభో। త్యాశాకర్మ బలేన తత్క్షయ మే మోక్షప్రదం సద్గురో॥

గురుప్రార్థనము.

అపిచ॥ తస్మాద్దాత్మవిచారేణ భవదోష వివర్జితః। శివజ్ఞానరతం శాంతం మహాపాతకనాశనం। ప్రణిపత్య గురుం ప్రాజ్ఞః। ప్రార్థయే ద్బుద్ధిమాన్ నరః॥ భవారణ్యప్రవిష్టస్య దిఙ్మోహభ్రాంతచేత

---

ములో అటులే శివుడనినను- ప్రణవమనినను- గురువనినను- ఏకార్థమునే వచించును. కాఁబట్టి యుత్తముడును- పూర్వోక్త లక్షణ సహితుడును నగు గురువును నాశ్రయించి పూజించి ధ్యానించి తరించవలయును. గాని, ధనాశాపీడితులును, క్రోధరూపులును, అజ్ఞానులును లోక ప్రతారణ శీలులునునగు కాపటిక గురువులవలన నెన్నడు శిష్యులు తరింపజాలరు.

ఇక శిష్యుడు గురువునకుఁ జేయు నమస్కారము మొదలగు దాని గూర్చి విచారింతము.

శిష్యనమస్కారాదికము.

శిష్యుఁడు భక్తిపురస్సరముగా గురువునకు నమస్కరించి పార్శ్వమందుండి ఓ గురూత్తమా! నూరులకొలది జన్మలనుండి సంసారమునఁబడి భ్రమించుచున్నాను. నన్ను రక్షింపుము.

ఈ సంసారవృక్షము ఆశాకర్మ బలముచేత సుఖఫలముల నొసంగునది యయ్యెను నేను మహాత్ముని దయారసముచే మాకు ప్రియ బాలువారిని వెంటనే మూలముతో గూడ పెకలించి పోవునో, అట్టిపుణ్యాత్ముఁడ వయిన యో గురుపరా! నాకు ముక్తి నొసంగుము.

పరమాత్మవిచారమున సంసారము నుండి తప్పించుకొని శివజ్ఞానాసక్తి కలిగి శాంతుడై మహాపాతకముల నశింపఁ జేయు గురువునకు నమస్కరించి బుద్ధిమంతుడగు శిష్యుడీ విధముగా ప్రార్థించవలయును.

గురుప్రార్థనము.

సంసారమనెడు నరణ్యమున దిక్కు దరిలేక దిరుగుచున్న నాకు మార్గమును జూపించిన గురుమూర్తి నమస్కారము.

అనంత జన్మలనుండి వచ్చు కర్మములనెడు కట్టెలను జ్ఞానాగ్ని చే దహింపఁ జేసిన శ్రీ గురుమూర్తి వందనము.

సః । యేన మే దర్శితః పంథాః తస్మై శ్రీగురవే నమః ॥ అనంత జన్మ సంప్రాప్త కర్మేంధనవిదాహినే । జ్ఞానానలప్రకాశాయ తస్మై శ్రీగురవే నమః ॥

గురుపూజా.

ప్రణమ్య దండవద్భూమౌ । శిష్యస్తం ప్రేణచార్చయేత్ । గురోః శ్రీపాదపద్మంచ గంధ పుష్పాక్షతాదిభిః । అన్యథా విత్తహీనోసి గురవే తత్పరాయణః । కృత్వా దండనమస్కారం స్వశరీరం నివేదయేత్ ॥ మన్నాథ త్రిజగన్నాథ మద్గురు త్రిజగద్గురుః । స్వాత్మైవ సర్వభూతాత్మా తస్మై శ్రీగురవే నమః ॥

దీక్షాప్రాప్తి క్రమః.

ఏవం విజ్ఞాపనం కుర్వతః శిష్యస్య గుర్వనుగ్రహం దర్శయతి ॥ ఇత్యుక్త్వా గురురాదరేణ కృపయా శిష్యం సమీపస్థితం । స్పృష్ట్వా పాణితలేన సాధు గదితం ప్రీతోస్మి వత్సాన్వయా । సంసారార్ణవ తార

---

అనంతజన్మలనుండి వచ్చు కర్మములను కట్టెలను జ్ఞానాగ్నిచే దహింపజేసినట్టి గురుమూర్తికి వందనము.

అని గురుప్రార్థనము జేసి సాష్టాంగదండప్రణామము చేయవలయును.

గురుపూజ.

అనంతరము లేచి గురుపాదపద్మములను గంధపుష్పాక్షతాదుల సమర్పించుకొని పూజించి గురువుని సంతోష పెట్టవలయును,

ధనహీనుడైనచో సాష్టాంగప్రణామంబు చేసి తన శరీరమునే గురువున కర్పించవలయును.

త్రిలోకప్రభువయిన నీవే నాకును ప్రభువవు. త్రిజగద్గురువువయిన నీవే నాకు గురువు. సర్వభూతాత్ముడవు నీవే. నాయందు కారుణ్యము కానరాగు నయార్త శరణు.

అని పైవిధమున విజ్ఞాపనము చేయు శిష్యునియందు గురువనుగ్రహము కలవాడయియుండదగును.

ణే పరశివే లింగ స్వరూపే మతే । ప్రాణం జీవకళాధరం తవనిధాస్యే
త్వం వదస్యాంపదం ॥

అపిచ ॥ ప్రతీపాఖ్యతంత్రే ॥ ఉపగచ్ఛ సదా దేహిన్ స్వావి
ద్యా వినివృత్తయే । కోహం మిత్యపరి బ్రూహి మాద్గురుం పరమ కార
ణం।అవిద్యాకృతకం సర్వ మిదం దేహేంద్రియాదికం। అంతశ్చ భ్రాం
తిసంసిద్ధం సత్యవత్పరికల్పితం । తస్మాత్కృతక భ్రాంతివినాశార్థమ
హం తవ । నిత్య లింగాంగసంయోగజ్ఞాన నిష్ఠాంత్వమావహ। ఇయాంగు
రుకృపాప్రోక్తా శివజ్ఞాన ప్రదాయినీ । మల మాయాది పాశౌఘ ధ్వాం
తధ్వంసపటీయసీ ॥ ఏవంప్రకారేణ కలాదియోగభోగకర్మకషాయమలప
రిపాకశక్తిపాత గురూపసదనాంతర దీక్షాలాభఇతి దీక్షా ప్రాప్తిక్రమః
యుక్తః ॥

---

దీక్షాప్రాప్తి క్రమము.

అంతట నాతఁడు శిష్యుని దగ్గరను దీసికొని, తనచేతితో శరీరము తుడిచి నీవు చరదిఓకుమారా! నీవుపలికిన పల్కులకు సంతసించితిని. ఈ సంసారార్ణవమునుండి తరింపఁజేయువాఁడను నిర్మలుఁడను. లింగస్వరూపుఁడను నగు పరశివుని యందు జీవకళను ధరించిన నీప్రాణము నుంచెదను. నీవుదానిచుంచు— అనగా నీ యిష్టలింగమునందు పూజాధ్యానాదులచే నిరంతరము పరవశుడవు గమ్ము అని బోధించును.

ఈవిషయమై ప్రతీపతంత్రమునందు గూడ వచింపఁ బడినది.

ఓశిష్యా? నీయావిద్యాపోవుటకై గురుసమీపమునకేగుము. కరుణావరుణాలయుఁడగు గురువుని నే నెట్టుల ఒప్పించితిని నే నెవడను. అని యడిగికనఁగొనుము.

ఈదేహేంద్రియాదికమంతయు నవిద్యాసముపార్జితమే కాని వేరుకాదు. భ్రాంతి నిర్మితమగు నిది యంతయు సత్యమువలె కల్పించబడినది. కావున నిట్టి కృత్రిమ భ్రాంతి నివారణమునకై శివసాయుజ్యము కొరకై నిత్యలింగాంగ సంయోగ జ్ఞానమునందునో జీవుఁడా! నిష్ఠబూనుము. అని తాను భావించి గురుకరుణాపాత్రుడై శిష్యుని తరింపఁజేయునని వచింప బడినది॥

మలమాయాది పాశసమూహమును నశింపజేసి శివజ్ఞానము నొసంగునది గురుకృపయే గాని మఱొకటి గాదని నిశ్చయింప బడినది.

### గురుస్తుతి.

శ్లో॥ నమః పరశివాకార స్ఫూర్తయే విగతార్తయే ।
జగత్త్రయీ ప్రవిస్తీర్ణ కీర్తయే గురుమూర్తయే ॥

ఇతి శ్రీగురు చెన్నవీరారాధ్య పాదారవింద పుష్పంధయ హృదయ ఘంటనామాత్యవర్య విరచితే శ్రీశివజ్ఞానశేఖరే శక్తిపాత గురుకరుణానిరూపణం నామ పంచమప్రకరణం ॥

---

దీక్షాప్రాప్తి క్రమమెట్టిది గాని, యుక్తిసమ్మతమైనదిగాను. మొదట కలాదియోగమును, తరువాత భోగముచే తదనంతరమందు కర్మక్షయమును పిమ్మట మలపరిపాకమును అటు పిమ్మట శక్తిపాతమును, దానితరువాత గురూపసదనమును, పదపడి దీక్షాలాభమును శాస్త్రములందు నిర్ణయింపబడినది. కావున దీక్షాప్రాప్తి సరియయినది. అనగా శాస్త్రసంప్రదాయాచారానుసారముగనే చేయబడుచున్నదని భావము

### గురుస్తుతి.

పరశివస్వరూపుడు - జగత్త్రయకీర్తి విస్తారుడు - ఆర్తిరహితుడు - నగుగురుమూర్తి కనేక వందనములు.

ఇది గురుచెన్నవీరారాధ్యుల వారి శిష్యుడగు ఘంటనామాత్యునిచే రచింపబడిన శివజ్ఞానశేఖరమునందు శక్తిపాతగురుకరుణానిరూపణమను పేరుగల పంచమప్రకరణము ముగిసినది.

# శ్రీ శివజ్ఞానశేఖరే,

## షష్ఠ ప్రకరణం.

శ్లో॥ వందే శ్రీగురుపాదుకాం శ్రితవతాం చేతోంబుజాతావనీ।
శ్రీమద్వర్ణితకర్ణికాంతరకనత్సింహాసనాధ్యాసినీం।
శోణాస్త్రర్నఖరాంశు మండల రుచారింఛోళికాభిస్ఫుటం।
తత్కింజల్కసముద్గతద్యుతిచయై రారజ్యమానామివ॥

### కీదృశీదీక్షా.

అథ దీక్షాం ప్రవక్ష్యామి। పాశత్రయవిమోచనీం। శివజ్ఞాన ప్రదాం దివ్యాం శివత్వప్రాప్తిసాధనీం॥ అత్ర దీక్షాశబ్ద నిర్వచనం॥ దీయతే జ్ఞాన సంబంధః క్షీయతేచ మలత్రయం। దీయతే క్షీయతే యేన సా దీక్షేతి నిగద్యతే॥

### గురులక్షణం.

వాతూలతంత్రే॥ ఈశ్వర ఉవాచ॥ ఉపదేశవిధిం తస్మాత్కథయిష్యామితచ్ఛృణు। ఏకో భవేదిహాచార్య శ్శివభక్తిపరాయణః। సద్గురుప్రభవో ఖ్యాతిః శాంత శ్శైవాగమార్థవిత్। అనూచానః ప్రసన్నాత్మా శివదీక్షాభిషేచితః। శివాగమజ్ఞో మతిమాన్। శివపూజా పరాయణః। రుద్రాక్షమాలాభిభాగీ త్రిపుండ్రాంకితమస్తకః। విశుద్ధ దేహామలినః

---

### దీక్షాప్రకరణ ప్రారంభః.

ఆణవపాశము- మాయాపాశము- కార్మికపాశము- అను మూడు పాశములనుండి దప్పించి శివజ్ఞానము నిచ్చి శివత్వము నొందుటకు సాధనమైన దీక్షను వచింతును.

### దీక్షయనగనేమి?

దేనిచేత జ్ఞానముగలిగి మలమునశించునో, అదియేదీక్షయనబడును,

ఆచార్యుడొకడే యుండవలయును, శివభక్తపరాయణుడై యుండదగును. సద్గురు వంశమున జన్మించినవాడును- మంచిచరిత్రగల వాడును- శాంతుడును- శైవాగమముల దెలసిన వాడును- నిర్మలమనస్సుగలవాడును- శివలింగపూజా పరాయణుడును, భ

శీలాచారసమన్వితః । వేదశాస్త్రార్థతత్త్వజ్ఞో జ్ఞానవాన్ గురురుచ్యతే ॥ గురుస్తు గుణవాన్ ప్రాజ్ఞో పరమానంద భాసకః । తత్త్వవిచ్ఛివసంయుక్తో॥ ముక్తికో నతుచాపలః । నిరపేక్షం మునిం శాంతం। నిర్వైరంసమదర్శనం । గురుం తమేవ ప్రణమేత్సాదరం మతిమాన్నరః॥

శిష్య లక్షణం.

శాంతోదాంతోపటుర్ధీరో బ్రహ్మచారీ హవిష్యభుక్ । శుద్ధభావోమహోత్సాహీ బోద్ధా శిష్య ఇతిస్మృతః ॥

శిష్యపరీక్ష.

గురుశ్చ ప్వాశ్రమే శిష్యం వర్ష మేకం పరీక్షయేత్ । ప్రాణద్రవ్యాపదానాద్యై రాదేశైశ్చసమాసతః । ఉత్తమాంశ్చాథమేకృత్వా

---

స్మరుదాశ్రిషుల ధరించిన వాడును, సదాచారసంపత్తి గలవాడును వేద శాస్త్రార్థముల నిజము దెలసినవాడును జ్ఞానియును- తత్వమునెఱింగిన వాడును- ముక్తినొసంగువాడును గుణవంతుడును- బుద్ధిమంతుడును చిత్తచపలతలేని వాడును నయిగురు వుండవలయును.

అపేక్షలేక- ద్వేషములేక- మునివలె శాంతుఁడై సర్వజనులయందు సమబుద్ధిగలిగి యెవడు ప్రకాశించుచున్నాడో, అట్టిగురువునకే నమస్కరించవలయును.

శిష్యలక్షణము.

శాంతుడు- బాహ్యేంద్రియనిగ్రహముకలవాడును- దాంతుడును.అవగాఅంతరింద్రియనిగ్రహముగలవాడును, సమర్థుడును, ధీరుడును బ్రహ్మచారియును, హవిస్సును భుజించు వాడును పరిశుద్ధభావముగల వాడును మతిమంతుడును- వితండ వాదము చేయక సరియగు ప్రశ్నలను వేసి గురువు చెప్పు సద్వాక్యములవిని యాచరణలో నుంచు కొను యోగ్యతగలవాడునునయి శిష్యుండుండ వలయును.

శిష్యపరీక్ష.

గురువు తనయాశ్రమమున శిష్యునినొక సంవత్సరము పరీక్షించ వలయును. గురువాజ్ఞాపించునన్ని శిక్షలకు శిష్యుడు పాత్రుడై యుండవలయును. గురువు ఉత్తమశిష్యులను నీచకర్మముల యందు నియోగించియు, నీచులను నుత్తమ కర్మలయందుంచియు పరి

నీచానుత్తమకర్మాణి। ఆకృష్టా స్తాడితావాపి యేవిషాదం నయాంతిహి
యోగ్యా స్స్యుః యతాశుద్ధా శ్శివ సంస్కార కర్మణి ॥

దోష సంప్రాప్తిః.

ఇత్థం పరీక్ష్య బహుధా దీక్షయేత్స్వవశానుగుః । అన్యథాదోష మాప్నోతి । శిష్యపాపం గురోరపి । పుత్రమాతృ పితృ భ్రాతృ దారా బంధుజనాశ్చ యే ।ఏకఏవ గురుస్తేషా మన్యథా నరకంవ్రజేత్ ॥

గురు రేక ఏవ.

పతి పత్నీ భ్రాతృపుత్ర దాసీ గృహచరాశ్చయే । ఏక ఏవ గురు స్తేషాం దీక్షైకాతు విశిష్యతే ॥

అథకాలశుద్ధిః.

మంత్రారంభస్తు చైత్రేతు బహు దుఃఖఫల ప్రదః। వైశాఖే

---

క్షించవలయును. గురువు శిష్యుని యెన్ని విధముల పరీక్షింపదగియుండునో అన్ని విధముల పరీక్షించినప్పుడు దుఃఖపడక యాశ్రమలను సహించి సంతోషపడుచుండువాడే శిష్యుడు.

## దోషసంప్రాప్తి.

శిష్యుని పరీక్షింపక దీక్షనొసంగిన దోషముసంభవించును " రాజపాపం పురోహితః " అనునటుల శిష్యుని పాపము గురువుకు గూడ కలుగును.

## గురువొక్కడేయుండవలయును.

కుమారులకు తల్లిదండ్రులకు సోదరులకు భార్యకు బంధుజనులకు గురువొక్కడే దీక్ష నొసంగవలయును. గురుభేదము పనికిరాదు, అనగా తల్లికొక గురువును- తండ్రికొకగురువును, కొడుకునకొకగురువును- యీవిధముగ తలకొక గురువు గాక, యిద్దరికొక్క గురువుకాని పనికిరాదు. ఎల్లరకు దీక్షనిచ్చు గురువొక్కడే యయియుండవలయును లేనిచో నరకము సంభవించును. వారి గృహములందు సంచరించు దాసదాసీ జనుల దగ్గర నుంచి గూడ గురువొక్కడే యుండవలయును.

## కాలశుద్ధి.

చైత్రమాసమున మంత్రోపదేశము నొందిన దుఃఖము గలుగును. వైశాఖమున

రత్నలాభస్స్యా జ్జ్యేష్ఠాయాం మరణం ధ్రువం। ఆషాఢేబంధు నాశస్స్యాత్ పూర్ణాయు శ్శ్రావణే భవేత్ । ప్రజానాశో భాద్రపదే సర్వత్రశ్శుభ మశ్వయుక్ । కార్తికే మంత్రసిద్ధిస్స్యా న్మార్గశీర్షే శుభావహా । పౌష్యేచ మంత్రిహాని స్స్యాత్ । మాఘే మేధావివర్ధనం। ఫాల్గుణే సర్వ సిద్ధిస్స్యా దితిమంత్ర విదోవిదుః ॥

దీక్షాంకుర్యాద్దినే ప్రాజ్ఞః సర్వదోషవివర్జితే। సుమాసతిథినక్షత్ర వారయోగాది సంయుతే। శిష్యస్య భక్తియుక్తస్య కృపా విష్టేగురౌ సతి । కాలేన లయ మభ్యేతి తస్మాత్సంసార ఇష్యతే॥

దీక్షాభేదః.

నిరాధారా హిసాధారా దీక్షాహి ద్వివిధా స్మృతా । ఆచార్య నిరపేక్షేణ క్రియతే శంభునైవయా। తీవ్రశక్తినిపాతేన నిరాధారేతి సా స్మృతా। ఆచార్యమూర్తి మాస్థాయ మందతీవ్రాదిభేదయోః । శక్త్యా యా కురుతే శంభుస్సాధికరణోచ్యతే ॥

---

రత్నలాభముకలుగును. జ్యేష్ఠమాసమునమరణము సంభవించును. ఆషాఢమాసమున బంధు నాశనము ఘటిల్లును శ్రావణ మాసమున పూర్ణాయుర్దాయముగలుగును. భాద్రపద మాసమున సంతానమునశించును. ఆశ్వయుజమాసమున సర్వశుభములు చేకూరును. కార్తీకమున మంత్రసిద్ధించును. మార్గశిర్షమున శుభము ప్రాప్తించును. పుష్యమున మంత్రహాని కలుగును. మాఘమున బుద్ధివృద్ధినొందును. ఫాల్గుణమున సర్వసిద్ధులు చేకూరునని మంత్రవేత్తలు చెప్పిరి.

శుభనక్షత్ర శుభమాస శుభయోగ శుభకరణ శుభలగ్న శుభతారాబల చంద్రబలములతో గూడిన దినమున భక్తియుక్తుడగు శిష్యునికి కృపాలుడగు గురువుదీక్ష నొసంగవలయును.

దీక్షాభేదము.

దీక్షనిరాధారయని సాధారయని రెండు విధములు. తీవ్రమగు శక్తిపాతమున- ఆచార్యాపేక్షలేకనే శివుండే దీక్షనొసంగును. అది నిరాధారదీక్ష,

దీక్షా యోగ్య స్థానాని.

అథ దీక్షాయోగ్యస్థానాని దర్శయతి ॥ స్కాందే ॥ సముద్రతీరే నద్యాంవా గోష్ఠేదేవాలయేఽపిచా । దేశేగురుగృహే క్షేత్రే దీక్షాకర్మ సమాచరేత్ ॥

మండపనిర్ణయః.

భూప్రదేశే శుభే రమ్యే నిమ్నోన్నతవివర్జితే । శాస్త్రోక్తమంటపం కుర్యాచ్చతుర్ద్వారం సుశోభనం । వితానధ్వజసంయుక్తం పుష్పమాలాసమాయుతం । సర్వాలంకారసంయుక్తం ఆమ్రపత్రైశ్చ వేష్టితం । దర్పణోదరసంకాశం గోమయేనాను లేపయేత్ । పంచ వర్ణసమాయుక్తాం రంగవల్లీం ప్రకల్పయేత్ । పుణ్యాహంవాచ యిత్వాతు ప్రోక్షయేత్స లిలేనతు ॥

దీక్షావిధిః.

ఇత్థం సమీక్ష్య బహుధా । స్నాత్వాచాచమ్య సుపవిత్రః । అ

మందతీవ్రాది భేదము ననుసరించి శివుండాచార్యరూపమును ధరించిచేయు దీక్ష సాధారణమని వచింపబడును.

దీక్షాయోగ్య స్థానములు.

సముద్రతీరమువందుగాని, నదీతీరమునందుగాని, పశువుల కోష్ఠమునందుగాని, దేవాలయమువందుగాని, స్వగృహమునందుగాని, గురుగృహమునందు గాని, క్షేత్రములందుగాని, పరిశుద్ధమగు ప్రదేశమున దీక్షాకర్మ నొనర్పవలయును.

మండపనిర్ణయము.

పరిశుద్ధమైన హెచ్చుతగ్గులులేని భూమియందు దీక్షనొందుటకై మండపము నిర్మించ వలయును. ఆమండపమునకు నాలుగుద్వారములుంచ వలయును చాందినీలు ధ్వజములు పుష్పమాలలు రంగవల్లులు మొదలగు వానిచే సామంటపమలంకరించ వలెను. గోమయమున నలికి పంచరంగుల ముగ్గులు పెట్టవలయును.

దీక్షావిధి.

పుణ్యాహవాచన మొనరించిన యుదకముచే నాప్రదేశమంతయు చల్లవలయును. ఈవిధ

చార్య సుతోపేతాః । సకలీకృత విగ్రహాః । చత్వారో ఋత్విజస్తత్రి । తస్యాచార్యస్య సమ్మతాః । అనిందిత చరిత్రిస్యుః । శివారాధనతత్పరాః । ఆదిష్టోగురుణా శిష్యః । ప్రభాతే పుణ్యవాసరే । విధాయ మంగళ స్నానం । ధౌతవస్త్ర పరిచ్ఛదః । విత్తానుసారా త్సౌవర్ణై । రలంకారై రలంకృతః। సుగంధిభి ర్నవై ర్మాల్యైః పుష్పైర్విహిత శేఖరః। సమస్త సంపత్సంప్రాప్తి హేతుభిర్భసితై స్సితైః । పూర్వోక్తాదిక్రమేణైవ కుర్యాత్త్రిపుండ్రకంతథా । సువర్ణ ఫలపుష్పాదిహస్తైశ్చానీయ మంగళైః । వృద్ధక్రమేణ సంప్రాప్తైస్తైశ్చాన్యైశ్చ తదంతరం । తత్పాద పీఠపర్యంతం । పుష్పాదిద్రవ్య సంచయం । సమర్ప్యదండవద్భూమౌ ప్రణమ్య చ పునఃపునః । ఉపేత్యాచార్య పాదాంచప్రణమ్య తదనంతరం। పూజయేత్స్వర్ణపుష్పాద్యైః । భక్త్యా విత్తానుసారతః । స్నాత్వా నలంకృ

---

ముగా నన్ని ప్రయత్నములు తయారుచేయించి గురువుస్నాన మొనరించి ధౌతవస్త్రముగట్టికొని యాచమనముచేసి సకలీకరణ మొనర్చుకొనవలయును.

ఇటులనే తక్కిన ఋత్విక్కులుగూడ స్నానముచేసి ధౌతవస్త్రధారులై యుండవలయును. ఆచార్యునివలె ఋత్విక్కులుగూడ శివారాధనమున మిక్కిలియాసక్తి గలవారును, సచ్చరిత్రగలవారునై యుండవలయును.

గురువుచే నాజ్ఞాపింపబడిన శిష్యుడు గూడ పుణ్యదినమున నుదయకాలమందే లేచి మంగళ స్నానమొనర్చి తెల్లనివస్త్రముగట్టుకొని, తనశక్తికొలది సువర్ణాలంకారములను పువ్వుమాలికలను ధరించిసర్వసంపదల నొసంగు భస్మ త్రిపుండ్రమును ధరించి యొకపళ్లెరమున సువర్ణము- ఫలములుపుష్పములు మొదలగు పూజాద్రవ్యము లుంచి వృద్ధులు తన్ననుసరించ, మంగళవాద్యములు మ్రోగుచుండ హస్తమున నాపళ్లెరము దీసికొని గురు సమీపమునకు రావలయును.

గురుపాదపీఠము డగ్గర శ్రీగంధము పుష్పములు మొదలగు ద్రవ్య సమూహ మంతయుంచ వలయును.

సాష్టాంగప్రణామము చేసియాచార్యపాదములకునమస్కారము చేయవలయును. శక్తిననుసరించి ద్రవ్యలోభము చేయక మహాభక్తితో చందనము- మొదలగుసుగంధ ద్రవ్య

తాః చీరవాససః ఋత్విజస్తథా । పుష్పాక్షతవిభూత్యాద్యైః శ్చక్షుః స్త్రక్ కరిపూజయేత్ । విభూతింశివ భక్తేభ్యస్సర్వేభ్య స్తదనంతరం। వృద్ధానక్రమతో దత్వా పుష్పాద్యైస్సమ్యగర్చయేత్ । అథ తేభ్యో నమస్తేభ్యో దేశికేంద్ర పురస్సరం । యథా ప్రదక్షిణం భక్త్యా తాంబూలాని సమర్పయేత్ । ప్రవిశ్య గురుం ప్రాజ్ఞః ప్రార్థయే ద్బద్ధమాత్మనః । ఉపగచ్ఛే త్సదా దేహీ స్వావిద్యా వినివృత్తయే॥

గురుప్రార్థనం

అంతస్తిమిరనిర్భేద భానవే కామధేనవే । సదంతేవాసినాం కల్పతరవే గురవే నమః । అవాఙ్మాత్మస్వరూపాయ శివభావప్రదాయినే । నమస్సద్గురునాథాయ షడ్ధ్వలబ్రహ్మమూర్తయే। తవపాదప్రసాదేన ముక్తోహం భవబంధనాత్ । త్వం గతిస్త్వేవ దేవేశ నాన్యథా మమ సద్గురో ॥ త్వం దేశికో భవసి యద్యది మేత దైవ శిష్యస్త్వమాహ న

---

ముల లో పుష్పాక్షత విభూతి మొదలగు పూజాద్రవ్యముల తోడను గురువును ఋత్విక్కులను బూజించవలయును.

విభూతిని మొదట పెద్దలకొసగి తరువాత యాచకుల కీయవలెను

దేశికుడు మొదలుగ పెద్దలందరికి ప్రదక్షిణమాచరించి భక్తితో తాంబూలముల సమర్పించ వలయును.

అనంతరము గురువునొద్దకు వచ్చి నమస్కరించి యీక్రింది విధముగ ప్రార్థించ వలయును.

గురుప్రార్థనము.

ఎల్లప్పుడును జీవునకు తనయావిద్యావినాశముకై గురుసమీపమునొందవలెను లోపలనున్న నాయజ్ఞానమును పోగొట్టుటయందు సమర్థుడవు. కామధేనువవు, సచ్ఛిష్యులకు కల్పతరువవునగునో గురువరా! నమస్కారము.

షట్స్థల బ్రహ్మస్వరూపుడవును, శివత్వము నొసంగువాడవును, ఉపనిషత్తుల చేతను వచింపరాని వాడవునగునో గురువరా! నమస్కారము. నీపాదరేణువు సోకినంత నేనే సంసారబంధము నుండి విముక్తుడనైతిని, నీవే నాకుగతి, నీకంటె నాకు మరెవ్వరులేరు.

నకించిదిహాబ్రవీమి । దేహేంద్రియాణామపనీయతయా విభిన్నం । కారుణ్య మీశ కురు సౌఖ్యవిభేదబుద్ధ్యా ॥ అనాయాసేనహియథాముంచేయం భవబంధనాత్ ॥

గురుబోధా.

అతః శ్రీగురుః। సాధుసాధుమహాప్రాజ్ఞ తుష్టోహం ,బుద్ధికౌశలాత్ । కథయామి నసందేహః ప్రశ్నస్యాస్య శేషతః । అవిద్యాకృత భ్రాంతి వినాశార్థ మహం తవ । నిత్యలింగాంగ సంయోగజ్ఞాననిష్ఠాం త్వమావహ ॥

కుంభప్రతిష్ఠాపనం.

అథ కుంభ ప్రతిష్ఠాపన మాహ । మత్స్యపురాణే ॥ తత్త్వాయామీతిత్రం ధాత్వా సౌవర్ణం పద్మమావిశేత్ । ఆప్రాణం నూత్నకలశం

---

మహాసద్గురూ! నన్ను తరింపజేయుము. మీరే నాకునిజ గురువులు. నేనుమీకుశిష్యుడను. కావుననో గురూత్తమా ! దేహేంద్రియాది సంసార బంధముగలిగిన నన్నాబంధమునుండి తొలగించి నాయందు దయగలిగి భేదభావమువిడిచి దీక్షనొసంగి యనుగ్రహింపుము. నాకీసంసార బంధ మనాయాసముగా నెటుల దొలగునో, అటులగావింపుము.అనిశిష్యుడు గురువుని ప్రార్థించవలయును.

గురుబోధ.

శిష్యా! నీబుద్ధి కౌశలమునకు సంతోషము చెందితిని. మంచిది. మంచిది. అవిద్యవలన వచ్చిన భ్రాంతినశించుటకును నిత్యలింగాంగ సంయోగ జ్ఞానమునందు నిష్ఠబూనుము. ప్రశ్నశేషమువలననే నీవిషయమును వచించుచుంటిని.

కుంభప్రతిష్ఠాపనము.

బంగారముతోగాని, వెండితోగాని, రాగితోగాని,చివరకు మట్టితోగాని, నిర్మించబడిన కలశముంచవలయును. అందుదకముంచవలయును.

ఆకలశకంఠము నందు కంకణము కట్టి వస్త్రము చుట్టవలయును.

ద్రోణాంబుపరిపూరితం। సౌవర్ణం రాజితం వాపి తామ్రిజం మృణ్మయం తథా। సితసూత్రావృతం కంఠే వస్త్రయుగ్మాన్వితం తథా। పంచామృతైః పంచగవ్యైః పంచత్వక్సంచ పల్లవైః। దూర్వాంకురైశ్చ సిద్ధార్థైః గంధ పుష్పాక్షతాదిభిః। శతౌషధీభిస్సహితం కుంభే తస్మిన్ ప్రదాపయేత్। లోకత్రితయ విఖ్యాత। పుణ్యక్షేత్రాణి సాగరాః। శివలింగస్య సంస్థానే పూర్వమేవ పరీక్షితే। త్రిస్థానశుద్ధం నూత్నంచ స్నాపనకుంభం నిధాపయేత్। సద్యోజాతాదభిర్మంత్రై రంభనామభిమంత్రిణం। షోడశై రుపచారైశ్చ సమారాధ్య సమాపయేత్। కుంభమాచ్ఛాద్య వస్త్రేణ ధేనుముద్రాం ప్రదర్శయేత్। సకలీకృత సంబంధాద్రక్షాంచైవతు కల్పయేత్। అధివాసనసిద్ధ్యర్థం శాంత్యర్థం వృద్ధి హేతవే। శంకరాచారసంపన్నం భోజయే ద్భక్త బృందకం॥

తథా వాతూలతంత్రే॥ శివకుంభం సమాసాద్య స్థండిలాదిషు పూర్వవత్। శివకుంభే శివం పూజ్య భక్తా నన్నేన తోషయేత్। తతో జాగరణం కుర్యా చ్ఛివధర్మాన్వితోత్సవైః॥

---

పంచపల్లవములు అనగా మఱ్ఱి మేడి మామిడి రావిజువ్వి అను వృక్షముల యొక్క చిన్ననికొమ్మలుదూర్వాంకురములు తెల్లఅవాలు గంధపుష్పాక్షతలు నూరు ఓషధులు కుంభము నందుంచ వలయును. సద్యోజాతాది మంత్రము లుచ్చరించ వలయును. ఉదకమభిమంత్రించవలయును. షోడశోపచార పూజచేయవలయును.

ఆకలశము మీద వస్త్రమును గప్పివేయవలయును. అనంతరము ధేనుముద్రను ప్రదర్శించవలెను. సకలీకరణ సంబంధమునను సరించి రక్షాబంధమును గట్టుకొన వలయును.

అధివాసన సిద్ధి కొరకును, శాంతి కొరకును, వృద్ధికొరకును, సదాచార సంపత్తి గల మహేశ్వరులకు భోజనమొసంగ వలయును.

వాతూలాగమము నందు గూడ నీవిషయమును గూర్చి వచింపఁబడినది. ఎటుల నస్థండిలము మొదలగు దానియందు శివకుంభమునుంచి అందు శివుని పూజించి భక్తుల కన్నదానము నొసంగవలయును. శివధర్మోత్సవములతో జాగరణముచేయు వలయును.

జలాధివాసనవిధి మేవం కృత్వా సదేశికః। తతః ప్రభాతేసుస్నాత్వా సమాచరితనైష్ఠికః। ధౌతాంబరసమాయుక్తో భూతిరుద్రాక్షభూషితః॥

పంచకలశస్థాపనం.

తదగ్రే మండలం కృత్వా చతురశ్ర సమన్వితం। ఆగ్నేయప్రభవం సూత్రం వాయవ్యేతు విచాలయేత్। ఐశాన్యాంప్రభవం సూత్రం నైరుత్యాంతు ప్రసారయేత్। చతురశ్రం సమంకృత్వా నవభాగవిభాజితం। మధ్యభాగేతు పద్మస్య కర్ణికాంతు సమాలిఖేత్॥

చతుర్భాగే తతః పద్మ మష్టపత్రోపశోభితం। ప్రథమంకర్ణికాభాగం ద్వితీయం కేసరాణిచ। తృతీయా దళసంధానం। దళాగ్రాణిచతుర్థకే। ప్రతివారణ రేఖాంతు పద్మబాహ్యేతు బుద్ధిమాన్।పద్మస్యైవప్రమాణేన సూత్రం దత్వా శివస్యతు। విధింపద్మార్థభాగేవ పద్మమానేన వా పునః। విద్యాసమో భవే త్పద్మం శోభాపద్మ సమాయుతం తతః ప్రకల్పితే చారుమంటపే వర్ణమండలైః కాంచనస్వర్ణాది కలశానాచార్యస్థాపయేన్నవాన్। ఏకంమధ్యే చతుష్కోణేష్వితగాంస్త్రాన్ ప్రపూ

---

దేశికుడీ విధముగ జలాధి వాస విధిని నిర్వర్తించి భూతిరుద్రాక్షుల ధరించి తెల్లని వస్త్రములుగట్టికొని ఆయధి వాసమునకు ముందు భాగమున చతురశ్రమండలమొకటి యేర్పాటు చేయవలయును.

పంచకలశస్థాపనము.

ఒక సూత్రము ఆగ్నేయదిశనుండి వాయవ్య దిక్కువరకు- ఈశాన్యదిశ నుండి నైరుతి దిశవరకును పట్టి చతురశ్ర మండలమును నేర్పరిచి అందు తొమ్మిది భాగములుగ విభజించి మధ్యభాగమునందు పద్మము దుద్దును వ్రాసి నాలుగు భాగములందు అష్టదళపద్మముపు వేయవలయును, పద్మాలంకృతమగు పట్టిసుందర మంటపమున బంగారు కలశములయిదుంచవలయును. ఒకటి మధ్యమునను, నాలుగు మూలలయందు నాలుగునునుంచ వలయును

